శైవప్రచారిణీ గ్రంథమాల. అనుబంధము 3

సంపాదకులు

కొడిమేల రాజలింగారాధ్యులు.

# ప్రతాపరుద్ర చరిత్రము





గ్రంథకర్త.

ఏకాంబ్రనాథుడు

## శైవప్రచారిణీ గ్రంథమాలయందు మాచేఁ బ్రకటింపఁబడు గ్రంథ రత్నములు

———(•)———

1 యుద్ధకాండము పద్యకావ్యము కోడూరి వెంకటాచల కవి ప్రణీత
2 బసవ విజయము ... తుమ్మలపల్లి నాగభూషణ కవి
3 లింగధారణ దీపిక ... మ॥ పం॥ భవానీ శంకరారాధ్యులు
4 శివజ్ఞాన శేఖరము ... ఘంటనామాత్యుఁడు
5 కాళహస్తీశవిలాసము... కాళహస్తీశ్వరుఁడు
6 మల్లికార్జున పండితారాధ్య చరిత్ర ...సంస్కృతము
7 నందికేశ్వర పురాణము „
8 శైవసిద్ధాంత దర్పణ 1వ సంపుటము 2వ సంపుటము
9 బసవపురాణము సంస్కృతము వ్యాసప్రణీతము
10 శివాధిక్య శిఖామణి ... రేణుకారాధ్యులు
...ము... శ్వేతాశ్వతరుఁడు
...ము సవ్యాఖ్యానము మల్లికార్జున పం
...రాధ్యుల వీరనారాధ్యు
...స్కృతము అసురకాండ,శరభ హేంద్రక
...దక్ష కాండ,ఉపదేశ కాండలు వ్యాసకృత
జ్యోతిర్నాథుఁడు
సిద్ధయోగి

...ఁ జేయుటకు గ్రంథము లేగదా! ...
...టకు ధనమేగదా! ఘూలకారణ...
...ధారపడి యున్నది. కాన,శైవమత ...
... దారులుగఁ జేరి, తమమతాభి మా...
...త్సాహ మొసఁగుదు రని నమ్మ...

ఇట్లు,
ప్రకాశకులు.

## శైవప్రచారిణీ గ్రంథమాలయందు మున్ను ప్రకటింపఁబడు గ్రంథ రత్నములు

—(*)—

1 యుద్ధకాండము పద్యకావ్యము కోదూరి వెంకటాచల కవి ప్రణీత
2 బసవ విజయము ... తుమ్మలపల్లి నాగభూషణ కవి
3 లింగధారణ దీపిక ... మ॥ పం॥ భవానీ శంకరారాధ్యులు
4 శివజ్ఞాన శేఖరము ... ఘంటనామాత్యుఁడు
5 కాళహస్తీశవిలాసము... కాళహస్తీశ్వరుఁడు
6 మల్లికార్జున పండితారాధ్య చరిత్ర ...సంస్కృతము
7 నందికేశ్వర పురాణము
8 శైవసిద్ధాంత దర్పణ 2వ సంపుటము 3వ సంపుటము
9 బసవపురాణము సంస్కృతము వ్యాసప్రణీతము
10 శివాధిక్య శిఖామణి ... రేణుకారాధ్యులు
...తము... శ్వేతాశ్వతరుఁడు
...ము సవ్యాఖ్యానము మల్లికార్జున పం
...ారాధ్యుల వీరనారాధ్య
...ృతము అసురకాండ,వీరమహేంద్రక
...త్.కాండ,ఉత్తరేశ కాండలు వ్యాసకృత
జ్యోతిర్నాథుఁడు
సిద్ధయోగి



...ఁ జేయుటకు గ్రంథము లేగదా! మూ
...టకు ధనమేగదా! మూలకారణ
...ధారపడి యున్నది. కావున శైవమత
... దారులుగఁ జేరి, తనుమతాభిమా
...త్సాహ మొసఁగుదు రని నమ్ము

ఇట్లు,
ప్రకాశకులు.

శైవప్రచారిణీ గ్రంథమాల - అనుబంధము - 3

ఏకాంబ్రనాథ విరచిత

# ప్రతాపరుద్రచరిత్రము.



మ. రా. సూర్యపల్లి బుచ్చన్న గారిచే సంపాదించఁబడినది.



ఇది

బ్ర. శ్రీ. విద్వాన్ ముదిగొండ వీరేశలింగ శాస్త్రిగారిచే

పరిశోధింపఁబడి,



బ్ర. శ్రీ. కోడిమేల రాజలింగారాధ్యుల వారిచే

శైవప్రచారిణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

వరంగల్.

కాపీలు 500

వెల. 0-12-0

# పీఠిక.

పాఠకులారా!

ఈప్రతాపరుద్ర చరిత్ర స్థానిక చరిత్రము. ఇయ్యది యాంధ్రసాహిత్య పరిషత్పత్రికలో నొకమారు ప్రకటింపఁ బడినది. ఎచ్చటను నింత వరకు పుస్తకరూపముగ వెలువడి యుండ లేదు. దీనిని గొంత వరకు మా॥ చిలుకూరి వీరభద్ర రావుగారు తమయాంధ్రుల చరిత్రలోఁ బ్రమాణముగా గ్రహించి యుండిరి.

ఇయ్యది స్థానిక చరిత్ర యగుటచే విషయమును సవరించక-నిక్షేపక-ముద్రించితిమి. "రుద్రమదేవి" గణపతి దేవుని భార్యయని యీగ్రంథమున కలదు. మ॥ రా॥ చి॥ వీరభద్ర రావుగారు తమగ్రంథమునదీని విమర్శించి కూతురని నిశ్చయ పరచి యుండిరి. ఇట్టి విషయము లనేకములుండుటచే విషయ విమర్శనము విడిచియున్నటులనే ప్రకటించితిమి. లేఖకుల ప్రమాద పతితములగు నక్షరపు పొరపాట్లను, సవరించి, పీఠికలను జేర్చి-సోమనాథుని గద్యతో. దీనిని వెలువడఁ జేసితిని.

ఈ గ్రంథమును- ఏకామ్రనాథుఁడుచే సినటుల మొదట నుండివరకు గలదు. అంతియేగాని యీయేకామ్రనాథుని గృహనామము గాని, వంశాదికముగాని యిందులేదు. అయినను- నీగ్రంథ మందలి ౬౩ వపేజిలో "నేకామ్ర నాథగురు వగురంగ నాథుఁడు" అని వచించుట చేత రంగనాథునికి శిష్యుఁడగు నేకామ్రనాథుఁడొకఁడుగలఁడని తెలియుచున్నది.

ఆంధ్రనామ సంగ్రహమును వ్రాసిన లక్ష్మణ కవి తండ్రియే కామ్ర మంత్రియని యొకఁడు గలఁడు అతఁడే యీతఁడైనచో! యీయే కామ్రనాథుని యింటిపేరు_పైడిపాటి వారని తలఁచ వలసియుండు ఈపుస్తకమును బట్టి కేవలము రంగనాథుని శిష్యుఁడేమో యనునూహకవకాశము గలుగుచున్నది. అర్థాను స్వారాదిక మిందు జేర్పలేదు.

ఈప్రతాపరుద్రుని వరకు కాకతీయ రాజ చంద్రులు వేయి సంవత్సరములు రాజ్యము చేసినటుల గలదు. మాధవ వర్మకుఁ బద్మాక్షీదేవి ప్రసన్నమై ఖడ్గ ఖేటకము లిచ్చి వేయి సంవత్సరములు మీవంశస్థులు రాజ్యము చేయుదురనియు అంతవరకు నీఖడ్గఖేటకములు మీ మొద్దయుండి తరువాత నన్ను చేరుననియు జెప్పెను. ఆవిధిగనే వేయి సంవత్స

రములు రాజ్యము చేసిన తరువాత పద్మాక్షి యొద్దకు ప్రతాపరుద్రుడు వెళ్లి వాటినిసమర్పించి నటుల గలదు. ఆంధ్రుల చరిత్రలో - మ॥ రా॥ చి॥ వీరభద్ర రావుగారు వేసిన కాల నిర్ణయమునకును - నీపుస్తకము నందలి సంవత్సరములకును - కొంచెము తారతమ్యముగ సరిపోవు చున్నది. కాకతీయుల వంశాను క్రమణికను నీక్రింద నుదహరించు చున్నారము.

ప్రతాపరుద్రుని వంశ క్రమము




పరీక్షితుఁడు
జనమేజయుఁడు
శతానీకుఁడు
క్షేమంకరుఁడు
[విజయార్కుడు]
విజయానందుడు
సోమేంద్రుడు
ఉత్తుంగభుజుడు
విష్ణువర్ధనుఁడు
నందుఁడు
విజయపాలుఁడు
వసుమతి యనుకన్య
అగ్నివర్ణుడు
వృషసేనుడు
కొమారు లనరులు బుట్టి—
వర్ణసంకరులై పోయిరి.
(కన్నడ దేవుడు)
కర్ణమరాజు
సోమదేవరాజు
మాధవవర్మ


పద్మసేనుడు
వెన్నమరాజు
పోరికి వెన్నమరాజు
గుండమరాజు
ఎరుకు దేవరాజు
భువనైక మల్లుడు
త్రిభువనైక మల్లుడు
కాకతి ప్రోలరాజు
రుద్రమహాదేవరాజు
మహాదేవరాజు
గణపతిరాజు
రుద్రమహాదేవి (భార్య) కొందరు కూతురని చెప్పుదురు.
(ఈమె పరిపాలించెను)
ముమ్మమ్మ (కూతురు)

ప్రతాపరుద్రుఁడు. — అన్నమ దేవుఁడు

విశాలాక్షుఁడు — వీరభద్రుఁడు — రుద్రమహాదేవి (కన్యక)

పద్మాక్షీ వరము వలన మాధవవర్మ మొదలుకొని ప్రతాపరుద్రుని వరకు వేయిసంవత్సరములు రాజ్యము చేసినటుల వ్రాయబడినది. ఎవరెన్నెన్ని వత్సరములు రాజ్యము చేసినది యీ క్రింద నుదహరింపబడుచున్నది.

| | | |
|---|---|---|
| మాధవవర్మ | ౧౨౦ | వత్సరములు |
| పద్మసేనుఁడు | ౨౮ | " |
| వెన్నమరాజు | ౮౩ | " |
| పోలికివెన్నమరాజు | ౨౬ | |
| గుండమరాజు | ౨౦ | " |
| ఎరుకదేవరాజు | ౨౪ | " |
| కుంతలదేవిః ఎరుకదేవరాజుమేనత్త | ౯ | " |
| భువనైకమల్లుఁడు | ౨౬ | " |
| త్రిభువనైకమల్లుఁడు | ౨౪ | |
| కాకతి ప్రోలరాజు (ఒరంగల్లు నిర్మించెను) | ౨౯ | " |
| రుద్రమహారాజు | ౮౮ | " |
| మహాదేవరాజు | ౨ | |
| గణపతి దేవుఁడు (రుద్రమహారాజు కుమారుడు) | ౬౮ | " |
| రుద్రమహాదేవి (గణపతి దేవుని భార్య) | ౨౮ | " |
| ప్రతాప రుద్రుఁడు, | ౩౨ | |
| | ౧౦౦౦ | సంవత్సరములు |

ఈప్రతాప రుద్ర చరిత్రను గాంచియే కూచిమంచి జగ్గకవి సోమదేవరాజీయమును ప్రబంధమును వ్రాసినటులున్నది. రెండు గ్రంధములకును సంపూర్తిగ విషయము సరిపోవుచున్నది. రెండాశ్వాసములవరకే సోమదేవరాజీయము గనుపించుచున్నది. ఆప్రతియందును చివర సమాప్తమనిలేదు. ప్రతాపరుద్ర చరిత్రలో నింకను గొంత విషయ

ము గన్పించు చున్నది. అందుచేతను- "సర్వంబును ద్వితీయాశ్వాసము" అనిగద్యలో లేకుండుట చేతను, సంపూర్తిగ జగ్గకవి వ్రాసియే యుండ వచ్చునని తోచెను. సంపూర్ణ గ్రంథములభింపమిచే నయ్యది ముద్రింప బడక లభించి నంత వరకే ముద్రింబడి యుండవచ్చును. సాధ్యమైనంత వరకు- వెదకి సంపాదించి సోమదేవరాజీయమును సమగ్రముగాముద్రిపించుట భాషాభిమానులకు ముఖ్యధర్మము.

ఇందు, నొక్కచోట దప్పఁ బ్రతిష్ఠల యందును "ఏకాంబ" యనియే గలదు. అందు వలన నటులే ప్రకటింపఁ బడినది. మఱొక్కచోట "ఏకామ్రనాథుఁ"డనిగలదు. ఈరెండు నామములలో ఏకామ్రనాథుఁడనుటయే యుక్తమని మా యభిప్రాయము.

ఈప్రతాప రుద్ర చరిత్రను సంపాదించి మాపత్రికయందును,పుస్తకములుగను ముద్రించు కొనుటకు నొసంగిన మ॥ రా॥ సూర్యపల్లి బుచ్చన్న గారికి (పోలీసు రైటర్ హనుమకొండ) మే మెంతయు గృతజ్ఞులము.

-ఇట్లు,

విద్వాన్ ముదిగొండ వీరేశలింగ శాస్త్రి.



# విషయసూచిక.

## ప్రతాపరుద్ర చరిత్రము.

విషయము. పుట.



స మా ప్త ము.



శ్రీశివాయ గురవేనమః



# శ్రీమత్ప్రతాపరుద్ర చరిత్రము.

శ్రీ సర్వదేవతామయుండును శ్రీశంభు లింగంబునగు నీశ్వరుని బూజించి నాగనాథుని యనుగులకు ప్రొక్కి ఏకాంబ్రనాథుండను వాఁడొక పుణ్యకథను నిట్టుల వచింప నారంభించె.

కృష్ణా గోదావరీమధ్య భాగంబునందలిదండకారణ్యంబు నందు మునిజన సేవితంబగు హిడింబాశ్రమంబుగలదు. అట్టి పుణ్యాశ్రమంబునకు, ఈశాన్య భాగంబునందు హనుమద్గిరియను నొక ధరణీధరంబు విలసిల్లు. అది దేవతా సిద్ధ విద్యాధర విహార యోగ్యంబు. అప్పర్వత మధ్యభాగంబున ప్రమథ గణంబులును, సకల మునిజన సేవితుండగు సిద్ధేశ్వరుండును, పూర్వభాగంబున భద్రకాళియు, దక్షిణభాగంబున పద్మవాస్తుండగు గోపాలమూర్తియు, పశ్చిమభాగంబున పద్మాక్షీదేవియు గలరు. కావున నగ్గిరి మహాదేవతామయంబై యొప్పు.

ఆగిరి మూలాధారంబుగా పురంబుఁ జేసికొని తన్నివాసులైన జనంబులు తద్వంశ క్రమంబున హనుమకొండయనుచు నగ్గిరి నేయుండును. కొమ్మ క్రాంతిఖను మొదలగు నెలుకరాజులు నూటయెనుబది యేండ్లు రాజ్యపరిపాలనంబు జేసిరి. తదనంతరంబున పద్మాక్షీ వరప్రసాదంబునం జేసి ఏకశిలానగరంబు గట్టించి మఱి పెక్కు సాహస కార్యంబులఁ జేసి యనేక రాజులం గెలిచి కాకతి రాజులు వేయిసంవత్సరములు రాజ్యపరిపాలనము జేసిరి. ప్రతాపరుద్రుని చరిత్ర సహితంబుగా తద్వంశానుక్రమణిక విధమెట్టులనగా:—

## —— కాకతిరాజుల వంశ చరిత్ర ——

శ్రీమన్నారాయణునకుఁ జతుర్ముఖుండు జన్మించె. అమ్మహాత్మునకు నత్రి జన్మించె. అత్రి నేత్రకమలంబున సుధాకరుఁడు జన్మించె. మహాదేవుండెవనిని జటాజూటమును సింహాసనంబున నిలిపి సకల దేవగణంబులకు నెల్లబత్తెంబులు పెట్టించెనో, అట్టిచంద్రునకు బుధుఁడనుపుత్రుఁడు జన్మించె. అతండు ననేక రాజవరులచేఁ బూజలు గొనుచుండె. అతని పుత్రుండు పురుహూతుండను వాఁడు చక్రవర్తియై సర్వంసహాచక్రంబు నేకచక్రంబుగా నేలుచుండె. అతని వంశంబున నహుషుండు బుట్టె అతని వంశంబున భరతుండు మహా విఖ్యాతిఁ జెంది చక్కగా రాజ్యంబు పరిపాలించె. తద్వంశంబున భారత వీరులనంబరఁగి భగవంతుడైన హరి పంచఁ జేరిన పాండవులు ధర్మభీమార్జున నకులసహదేవులన విలసిల్లి రాజసూయాశ్వమేధంబు మొదలగు క్రతువులు గావించి దేవముని పితృగణంబుల సంప్రీతులం జేసి మఱియు సకల ధర్మంబులఁ బ్రతిష్ఠించిరి.

వారలలో మిక్కిలి కిరీటి మేటియై ముక్కంటి గెల్చె. అదియుం గాక శ్రీకృష్ణదేవుని రథసూతుంగాఁ జేసి మారుతాత్మజుని కేతనంబుగా జేసి మఱియుఁ గౌరవుల గెల్చె. అట్టి వాని మహిమ యేమి చెప్పను! ఆ ధనంజయునకు నభిమన్యుండు జన్మించె. అతండు తండ్రియంత పరాక్రమశాలియయ్యె. అతనికిఁ బరీక్షిత్తను సుతుండు జన్మించె. ఆఘనుండు శ్రీరామ చంద్రుని యట్లనేక ధర్మంబులు నాలుగు పాదంబుల నిలువం జేసి కృతయుగ చర్యనడిపించె.

అమ్మహాత్మునకు జనమేజయుండు జన్మించె. అతండు తండ్రి పగదీర్చుటకై తక్షక నాగాదుల నాశనంబుగా సర్ప యాగంబు గావించె. అతనికి శతానీకుండను వాఁడు సుతుండై తాతయట్లు ధర్మ పరంపర నిలిపి విజయుండయ్యె. అతనికి క్షేమంకరుండు జన్మించె. తన రాజ్యంబు నొక్క భాగంబు దేవబ్రాహ్మణులకునిచ్చి యొక్క భాగంబు బంధుమిత్ర పరివారసమేతంబుగా ననుభవించుచుండె. అతనిధర్మాధర్మంబులు రాధే యాదులతో నే[illegible]ండనువాఁడు

ను, సోమేంద్రుడను వాడును జన్మించిరి. విజయార్కునకు విష్ణువర్ధనుండు నుజన్మించె సోమేంద్రునకును త్తుంగభుజుండు జన్మించె.అతండు దాయాదుల తో రాజ్యంబుకై పోరియోడిగోదావరీతీరమందలి ధర్మపురికి దక్షిణభా గంబున ననతి దూరంబున నొక్క పురంబు గావించుకొని రాజుల గెలి చిననాఁట యరువదియారు దుర్గంబులు సాధించి రాజ్యంబు పాలించె.

మఱియు నతని చరితంబు బుధజనంబులచే గద్యపద్య ప్రబం ధాదికములచేఁ జెప్పంబడె. అతని యగ్రమహిషియందు నందుండను రాజోత్తముండు దుదయించె. నందుండతి తేజోవంతుడయ్యె. అతనిచ రితంబులు నలకార్త వీర్యాద్యులట్ల మహిని శోభిల్లుచుండె. అందుకు సంగ్రహంబుగాఁ జెప్పెద.

ఆ నందుండు నందగిరి ప్రవేశించి నందగిరిని బురంబు గా వించుకొనియె. అందు చండవర్మ సూర్యాదిత్యులు ప్రధానులుగా నుం డిరి. శారదానందుడు గురువుగా సులభుడు వాహినీపతిగా భానుమతీ దేవి పట్టంబు రాణిగా లంబోదరుండను రాజు చెలిమికాడుగా మఱియు ననేకజనులు దండనాయకులై యతని పనులు నడుపుచుండిరి. ఇవ్విధం బున కొన్ని సంవత్సరంబులు రాజ్యంబు మహా మహిమతోఁ బాలించె.

శ్రీ నగరంబునకుఁ బోయి మల్లికార్జున లింగంబును భ్రమరాం బా దేవిని సేవించి యాప్రదేశంబున నొక్క బిలంబు సొచ్చి పోవు చుండ, నందు నొక్క మహాయోగి గనిపించె. అమ్మహాయోగిచే ఖడ్గ ఖేటకంబులను మహాస్త్రంబులు గొని మఱియు నబ్బిలంబు దూరి చను నప్పుడు, నారాయణమూర్తియై యందు జనార్దనుండతి భ్రమణంబు గా భ్రమిపెట్ట నొక్కింత చలింపక నిలిచిన, నాదేవుండు మెచ్చి య నేక వరంబు లిచ్చిన గైకొని, అందుండి మగుడి బిలంబు వెడలి దివ్య యోగిని గనుంగొని, అనేకంబులుగా స్తుతియించి చోళేంద్రుతో మహా యుద్ధంబుఁ జేసియతనిచే పూజలుగొనిసునందయను కన్యకను బరిణయం బై సేతువున కరిగిరామేశ్వరుని సేవించిదివ్యాస్త్రంబులచే నావిభీషణుం గెల్తునని యచ్చట నిల్చిన, ఆవిభీషణుండు సర్వధనంబులు కానుకలుగా

పెట్టిన, గైకొని నిజరాజధానియగు నందగిరి ప్రవేశించి రాజ్యంబు పా
లింపుచుండె.

ఆనందునకు సునందయందు నగజారమణుని కరుణచేత సుమతియను కన్య
యును విజయపాలుండను సుతుండు దయించిరి. సుమతి కన్యకను యదువం
శతిలకుండైన సత్యభానునకు వివాహంబు జేసిరి. అంత సుమతియను కన్య
కకు వృషసేనుండు జన్మించె. మఱియు విజయపాలునకు నగ్నివర్ణుండను
నతండు జన్మించె. విజయపాలుండు కొన్ని దినంబులకు మృగశాపంబున
విగతజీవుండయ్యె. మరల శారదానందుని ప్రసాదంబున సుజ్ఞానుండ
య్యె. అంత నందుండను పేర పెక్కు సంవత్సరంబులు రాజ్యంబు పాలిం
చి యోగమార్గంబు దాల్చి భోగంబులు చాలించి శ్రీశైలంబునకు జ
నునప్పుడు తన వెనుదగిలి పుత్రదౌహిత్రులైన యగ్నివర్మ వృషసేనులం
గాంచి వారల శారదానందునకు నప్పగించ, వారల యభీష్టంబు లెఱిం
గి నందుండు శ్రీశైల నివాసుండయ్యెను. అట్లు చోళాఖ్య వంశుండై
న నందుని యిచ్ఛాక్రమంబున శారదానందుండు రాజ్యంబునకు నగ్ని
వర్మ వృషసేనుల నభిషిక్తులం జేసి రాజ్యంబు విభాగించి యిరువురకుం బం
చి యిచ్చెను. వారలు శారదానందుని యాజ్ఞా ప్రకారంబు రాజ్యంబు
సేయ మహోత్సాహంబయ్యె.

అంత వృషసేనుండు దేవేంద్ర మఖంబు గావించి ధాన్యవృష్టి
గురిపించుటచే నది కారణంబున వృషసేను వంశంబున వృష్టి సంజ్ఞ
దనరుచుండు. చాళుక్య వంశజుండగు నగ్నివర్ణుండు నందగిరి రాజధానిగ
జేసికొని రాజ్యంబు పాలించి యనేకసుతులగాంచె. అక్కుమారవర్గం
బు, అగ్నివర్ణుని పరోక్షంబున రాజ్యంబు గుడువ నొల్లక తమలో తాము వై
రంబు దెచ్చుకొని పోరంజొచ్చిన నందు కొందరు తెగపడి వృష్టికుల
భూపతులకు సహవాసులై యుంటిరి.

అప్పుట వృషసేనుని వంశంబున ననేక రాజులు పరిపాలించిన
తర్వాత వృష్టికుల తిలకుండైన కన్నడ దేవుండను మహారాజు జన్మించె. అ
తడు కంధారంబు రాజధానిగ పాలించి భూదేవపూజలు విధ్యుక్తంబుగా

నడిపి గోదావరీ తటంబున నున్న విప్రులకు పదమూడు వేలయేను నూరు [ ౧౩౫౦౦ ] అగ్రహారంబులు సమర్పించి రాజ్యంబు నేలుచున్న సమయంబున, ఆమహారాజునకు సోమదేవరాజు జన్మించె.

## సోమదేవరాజ వృత్తాంతము.

—oo—

ఇతండు దినదిన ప్రవర్ధమానుండై తండ్రి పరోక్షంబున రాజ్యంబునేలుచుసకలధర్మంబులు నడుపుచుండె అట్టియవసరంబుననాతఁడు తనమూడువేలయేనూరుగోగణంబులమంత్రకూటంబులు మొదలుగ గోదావరి యుభయ తీరంబుల మందలు గావించియధికారుల నియోగించె.

వారలు మేపుచున్న యెడను కటకవల్లభుండొక్కనాఁడు సోమదేవరాజు వృత్తాంతం బంతయు చారులచే విని సకల సేనాపరివార సమేతుండై సోమదేవరాజుపై దండెత్తి వచ్చి గోగణంబు చుట్టుముట్టి తద్గోపాలురతో గొప్పయుద్ధంబు గావించియాగోపాలకుల నోడించి గోవుల మరల్చుకొనిపోయె. ఆగోపాలకులు కందారంబునకు వచ్చి సోమదేవరాజునకు నావృత్తాంతం బంతయు దెలియఁ బలికినవినియాతఁడు మహా కోపోద్రేక దీపితుఁడై సర్వసేనా సమేతుండై కటకంబుపై సేనల విడిసి ఆరునెలలు కటకంబును ముట్టడిచేసి మహా యుద్ధంబుఁజేయ సర్వసేనలు సమసిపోయె.

మరల నాతఁడు బలంబుల గూర్చికొని కటకంబునకు పోయి మెప్పటి యట్లు యుద్ధంబు చేయుటచేత సర్వ సేనలును మడసెను. మగుడకందారంబునకు వచ్చి మగుడ బలంబుల గూర్చుకొని తిరిగి కటకంబునకుఁజని మాసద్వయంబు ఘోర యుద్ధంబుఁజేయ సకల సేనలు మడసిన, తిరిగి కందారంబునకువచ్చెను. అతడు ఆరుమార్లు కటక వల్లభుని సాధించి గోవుల మరల్చు కొందునని పోయి సాధించ నేరక మహాచింతా క్రాంతుండై బుధజనా మాత్యవర్గంబుతో ఁగటక వల్లభుని సాధించు తెరంగు నెఱుంగం బలుకు మనవార లిట్లనిరి. ఓరాజా!

మానుషశక్తులకు నలవిగాదు. ఏదేని దైవ వరప్రసాదంబునం జేసి గెలువందగు. ఇతరోపాయంబుల గెలువ నలవిగాదు. పుత్రకామేష్టి యాగముచే తేజోవంతుడగు కుమారు నగ్ని దేవు ప్రసాదంబున గనుము. ఆ తేడు కటక వల్లభుని జయింప గలడని వారలు పలుక, యారాజు విని త్ర్యంబక పర్వతంబున గోదావరి యుభయ తటంబుల నున్న తన యగ్రహారంబులగు పదమూడువేల యేనూరు యగ్రహారంబులంగల వేద వేదాంగప్రచండులైన బ్రాహ్మణుల రావించి యాగంబుచేసి వారల బహువిధంబుల పూజించి, అపారధన కనకవస్తువాహనంబులనాందోళికాభరణంబుల వారి కర్పించిన, సోమ దేవరాజునకు వారనేకాశీర్వచనంబులిచ్చి ప్రోత్సాహ పరచిరి.

ఈవృత్తాంతమును విని కటక వల్లభుడు సర్వ సేనల గూర్చుకొని సోమదేవ రాజుపై దండెత్తి కోటముట్టడించి మహా ఘోరంబుగా యుద్ధంబు గావించుచు సోమదేవరాజు సేనల సమయించి సోమదేవ రాజు తలదున్మెంచె.

అంతఁ జావగాఁజిక్కిన చారులు కందారంబునకు పరువులిడుచు వచ్చి సిరియాళదేవితోఁదన భర్త మృతిబొందిన వృత్తాంతంబంతయుఁ జెప్పిన నాదేవి యధిక దుఃఖితురాలై గర్భిణీ స్త్రీగావున నిచ్చటనున్న యెడల శత్రువులు వచ్చి తన్ను జంపుదురని బ్రాహ్మణ బృందముతో హనుమకొండకు వచ్చెను.

తదనంతరంబునఁగటక వల్లభుండు బలంబులుచు తానునుగలసి ద్వారంబుఁజొచ్చి కందారంబును గాల్చికోటలు త్రవ్వించి గానులు నరికించి మేడలు కూల్చద్రోయించి యాపురం బంతయు నున్నంబుజేసి సిరియాళదేవిని వెదకి కానక కటక వల్లభుండు నూరిండ్ల బ్రాహ్మణుల ను దీసికొని హనుమకొండ దిక్కు పోయినదని చారులచే విని హనుమకొండపై వచ్చెను.

ఆవార్త మెట్ల వారిచే విని మెరుకురాజు తహతహపడి శరణా

## ప్రతాపరుద్రచరిత్రము.

గతుల నిచ్చుట యత్యంత నరకంబనియును, నీయక యదర్చి పోరం బో యిన ప్రాణహాని యనియును, విచారించి యంగు కందారంబున నుండి వచ్చిన బ్రాహ్మణులతో గలసి సిరియాళదేవిని నిశీధసమయంబునఁబురివె లువడె నని యెవలు నెఱుంగకుండ వెడలదోలించెను.

ఇవ్విధంబున సిరియాళదేవి హనుమకొండ నుండి వారలతో వెలువ డియా విప్రులందరికి సాష్టాంగముగ నమస్కరించి మీరలందరు బహువి ధంబుల నెట్టకేని, యెవ్విధంబుననైన మిమ్ముల రక్షించు కొండని వారలఁ బంపి తదనంతరంబున సిరియాళదేవి తిరిగి హనుమ కొండకు వచ్చి యె రుకరాజుల పురోహితుఁడగుమాధవ శర్మ యొక్క నగరుజొచ్చి తన వృ త్తాంతంబంతయు నెరిగించి నమస్కరించి లేవకున్నం జూచి బ్రాహ్మణ శ్రేష్ఠుండగు మాధవశర్మ సిరియాళదేవికి నభయంబిచ్చి వెరవకుమని యూరడ బలికి యప్పుడే తన సమీపంబున నున్న భృత్యులచే హనుమ కొండలోనున్న బ్రాహ్మణుల రప్పించి యీవృత్తాంతంబంతయు వారల కు రహస్యంబుగా నెరిగించ నందరు నేకగ్రీవంబుగా బలుక నంగీకరించిరి.

అంత కటక వల్లభుండు హనుమకొండపై విడిసి యాపుగం బేలు యెరుకరాజుల వివేకాతి చరులను వారితో కందారంబుననుండి సోమదే వరాజు యగ్రమహిషి గర్భంబుతో నూరిండ్ల బ్రాహ్మణులుం దాను వ చ్చి మీవద్దనున్నది. ఈ బ్రాహ్మణులతో గూడ సిరియాళదేవిని మా చేతికి పట్టి యిచ్చి మావారై సుఖంబుననుండుఁడు. ఇంచుక బెనంగితి రేని కందారంబును జేసిన లక్షణంబు యెరుగుదురు గదా! యని పలు క వారలిట్లనిరి.

సిరియాళదేవి మాపురంబునకు రాలేదు. ఎట్టి దాసమైనా చే సెదము కాక, ఆయుధహస్తులై వచ్చి ఇండ్లలో వెదకు మన, ఆయనుచరులు రాగా విప్రులు, గృహంబులలో జనంబుల బయట వెదకుండనిన వారలు సముఖబాహువునిపాలికింజని దానినెరిగించిరి. సముఖబాహుండును రా జగృహంబులు వెదకుటకు స్త్రీజనంబులు వెదకుటకు విప్రవరులనుమ

జియు నానాజాతి గృహంబులు వెదకుటకు నానా జాతుల నియోగించి వారల కపారధనంబు లొసంగియుణి మయాభరణ చీనిచీనాంబరంబులు నిచ్చెద నాకునతడు నెచ్చెలికాడును ప్రాణబాంధుండుననగును. ఇందుకతి ప్రవర్ధపి యజ్ఞనంబుల నొడంబరిచె.

అట్లు రాజుచే ననుజ్ఞాతులై వారలుహనుమకొండజొచ్చి రాజగృహంబులును మేడలును, రాణివాస గృహంబులును, బంధు గృహంబులును, నేల మేడలును, పశువుల గృహంబులు నూతులు, తోటలు, నానాజన నగరంబులును, వెదకివచ్చిన కానక మగుడివచ్చిచూచినవి మగుడి చూచుచు, పోయిన వీథికే మగుడిపోవుచు ఎక్కినమేడలు మగుడియెక్కుచు, ఈ విధంబున సిరియాళదేవిని గానకపురంబులో జనుల నొక్కొక్కరిని రావించి చూచునెడ కందారంబు ప్రజల నొక్కరిని గానకయేడు దినంబులు వెదకి వేసారి బ్రాహ్మణ స్త్రీలలోనున్న సిరియాళ దేవినిచూచి కొందరిది రాజపత్నియగు నని తలంచి బహు జనంబుల వచ్చు నది యెట్టియుండ నేర్చునే! ఇది యొక్క విప్రాంగనయే కాబోలునని మగుడ వారన, నందొక్క డుండి ఈ యింతి నీక్షించగా నీయింతి రూపాతిశయంబులు విచారింప మొగంబు చంద్రు బింబమును ధిక్కరించు చున్నది. ఈ నీల కుటిల కుంతలంబులును ఈవిశాలనేత్రంబులును, ఈదీర్ఘ బాహువులును, ఈ మందయానంబును పాదపద్మంబులును మెరుంగులును ఇతర జన కాంతలకు గలుగ నేర్చునే! ఇది రాజపత్నియగు సిరియాళదేవి యగు తప్పదు ” అని నిశ్చయించి తమ వారల కెఱింగించి యెలుకు రాజుయును మతంబున కటకవల్లభుని సమ్ముఖంబునకు దోడ్కొని పోవ నారంభించె.

ఆసమయంబున నచ్చోటి విప్రులుండఱును సిరియాళదేవిని మరల తీసుకొని హాహా కారంబులు సేయుచు, “ఈకాంత విప్రకాంత. మాధవ శర్మకూతురు. ఈచెలియ పెనిమిటి వారణాసికిం బోవుచు మాతృగృహంబుననునిచి చనియె. ఇది నిజంబు. ఎట్టి సత్యంబైన చేసెదము. అట్లు గాద

దలంచితిరేని నీకాంతతో గూడ నీవిప్రులందరము సొదలు జొచ్చువార
మని దీక్షగట్టి హరిద్రావస్త్రములు దాల్చి వీరజడలల్లుకొని తమగృహం
బులువిడ్చికొని శపింప తెగిబడియున్న విప్రులంజూచి "కటకవల్లభుండును న
తని యనుచరులును గడగడ గజగజ నొడలు వణకుచు మహా భీతచిత్తులై
యావిప్రులకు నమస్కరించి "ఇదిరాజకాంతయని పట్టితిమి. ఇంతయే కా
క మాకుమీకు వైరంబుగలదె? కోపంబులు సైరింపుడు. మీకుమాకు
నన్యోన్యతగవు గలదు. అదియెట్లనిన. ఈవిప్ర జనంబులు సిద్ధేశ్వరుని స
ముఖంబున గూర్చుండి యీ చెలివడ్డించిన యన్నంబులు రోయక భుజించి
తిరేని యిది విప్రకాంతయగును. కాదేని మీరు నిజంబు పలికిన మీకు వేయి
గ్రామంబులు నగ్రహారంబులుగా నిచ్చి యీకోమలిని శిక్షించి యీగర్భం
బుననున్న శిశువును మరలకందారంబునకు బట్టంబుగట్టెదమని నీతియు
క్తంబుగా నాడిన వాగ్వతో విప్రులిట్లనిరి.

ఈస్త్రీ రాజకాంతకాదు. విప్రులకు సింహాసనం బేటికి? ఈకోమలి
విప్రకాంతయగు తథ్యంబు. ఇదిగో చూడుడని తత్క్షణంబున సిద్ధేశ్వర శ్రీ
మన్మహాదేవు సన్నిధికింజని యావిప్రులందఱు నచ్చటి గుండంబున మునిగి కృ
తానుష్ఠానులై యద్దేవుని వేదోక్తంబుగా నారాధించి బహువిధంబు
లం బూజించి చతుర్విధోపహారంబుల నైవేద్యంబు లిచ్చిరి. ఆనైవేద్యంబు
లా కోమలి వడ్డింపనందఱును పంక్తికి గూర్చుండి సోమదేవరాజు వేదా
ధ్యయన పారాయణులు దగుటం జేసి, "వేదాధ్యాయ రతో విప్ర" యని
యొక వాక్యంబు మనస్సులో నిల్పికొని సిద్ధేశ్వర శ్రీమన్మహాదేవున కె
దురునిలిచి చెయ్యెత్తి చాచి, యీకాంత విప్రకాంతయని పల్క యాయం
గనవడ్డించు యన్నంబులు సంతుష్టిగా నారగించిరి.

ఆసమయంబున సకల జనంబులు చూచుచుండ నావిప్రులపై శ్రీ
మన్మహాదేవుండు పుష్పవృష్టి గురిపించెను. అది యంతయుం గని కటకవ
ల్లభుని పరిజనంబులు గజగజ వణకుచు వల్లభుని రెంగించిన నాతడు వి
ప్రులరావించెను. ఆవిప్రులకనేక ధనంబులొసంగి తనవారలు తాను కట
కంబునకుం బోవుచు నానాదేశంబులకు సిరియాళదేవిని వెదుకం బంపెను.

## *మాధవ వర్మజననము*

అంతనిక్కడనొక్క సుముహూర్తంబున సిరియాళదేవి ప్రసూతి యాయెను. సర్వలక్షణ సంపన్నుండైన కుమారుం డుదయించెను.

ఆవిప్రులు జననవేళ యెరింగి యుబ్బాలుండు సర్వసర్వం సహా నేకఛత్రంబుగా గర్భాష్టకంబున మహామహిమతో పాలింపగలఁడని పలికిరి. అబ్బాలునకు పుణ్యాహ వచన విధులు చేసి నామ కరణము సేయుటకై సిరియాళదేవినిజూచి మీయభీష్టం బేమనివారడిగినవామెయావిప్రజనంబుల కిట్లనియె. ఈమాధవ శర్మయే దైవంబు, దాతయు తల్లియు దండ్రియునగు వీరుచేసిన నామకరణంబు నాకునభీష్టంబని పలికెను ఆవిప్రులట్లగాకయనియబ్బాలునకుమాధవవర్మయనినామకరణంబుసేసిరి.

ఆకొమారుని విప్రదంపతులు పోషింపుచు శుక్లపక్షసుధాకరుండనంబరగి దినదిన ప్రవర్ధమానుండై పెరుగుచున్నయెడ, గర్భాష్టకమున నుపనయనంబుఁజేసి, యుపాధ్యాయునొద్ద పద్మాక్షీ సముఖంబునఁజదివింపుచుండిరి.

## —* మాధవ వర్మకుబద్మాక్షీదేవిప్రత్యక్షమైవరం బిచ్చుట *—

ఒకనాఁడా బాలుఁడు తనతోఁ జదువు బాలులు తాను నునాటతమిఁబలకపుస్తకమును బద్మాక్షీదేవి చేరువపెట్టి యగ్గుశిలుపుపెట్టి విహరించుచుండ నస్తమయం బాయెను. అంతయింటికిఁబోయి మజ్జనభోజనంబులదీర్చి రాత్రిచదువందగు పలకయు పుస్తకంబును లేకునికి మాధవశర్మ తననెక్కడ కోపించునోయని యట్టిరాత్రికాలంబునందు బద్మాక్షీదేవి సముఖంబునకు దానొక్కరుండు చనెను.

అందతి భయంకరంబై భూత ప్రేత పిశాచశాకిని ఢాకిని భేతాళ బ్రహ్మరాక్షస పరివృతమై సింహాసనంబున బద్మాక్షీ దేవికొలు వుండెను. కానియవమాత్రంబైన మాధవ వర్మచలింపక భూతగణంబుల, జేత, నెట్టివేయుచు యద్దేవి సముఖంబున నున్న పలకయు బుస్తకంబుమ బుచ్చుకొని నిలిచియుండెను.

అంత నబ్బాలునిసాహస ధైర్యంబులకు దేవి వెరగంది యతని ధైర్యంబుఁ జూచుటకు నతిభయంకర రాకారంబు దాల్చెను. అబ్బాలుండు దానిని గాంచి యావలియుతఁజలింపక నిలిచి ముకుళిత హస్తుఁడై బహువిధంబుల స్తుతియించుచు నద్దేవి పాదపద్మంబులకు మ్రొక్కి లేవకుండెను. దానిం గనిదేవి యత్యంత దయార్ద్రమానసయై" వత్సా! నీభక్తి ధైర్యంబులకు మెచ్చితి. నీకిష్టంబైన వరంబు వేడుమని పలికిన నబ్బాలుండు తనజననిచేఁ దాఁ డెచందంబు తెయు నెఱింగినవాఁడై వంశునఁ గటకవల్లభుని సాధించి తమగోధనంబులు మరల్పునట్లు వరంబు కృపసేయుమనెను.

అద్దేవినీవన్నయట్లు కృపసేయుచునని యొక్క దివ్యఖడ్గంబును దివ్యఖేటకంబును గృపఁజేసి, ఈఖడ్గంబు నీచేతనున్న నిన్నెదిర్చిన శత్రువుల డంగుదురు. ఈదివ్యఖేటకంబు నీచేతనున్న శస్త్రాస్త్రంబులునిన్నుఁ జేరవు. అనియానతిచ్చి ద్విగుణిత సహస్ర మాసంబులు రాజ్యంబు చేయుమనిపల్కి తనసమీపంబునున్న నొక్క బిలంబునుజూపి పశ్చిమ ముఖుండవై యరిగి యొక్కరమ్య ప్రదేశంబుననీవీబిలంబు వెడలి యున్నసమయంబున సూర్యోదయపర్యంతరంబునకు నబ్బిలమార్గంబు వెడలి చతురంగ బలంబులు నీవెంటచనుదెంచునని యానతిచ్చి మఱియునిట్లనియె.

ఈదివ్యఖడ్గ ఖేటకంబులు మీయింట సింహాసనంబున వెయ్యేండ్లుండునని యానతిచ్చి గోబ్రాహ్మణ పూజయు, నుమామహేశ్వర పూజయు, లక్ష్మీనారాయణ పూజయు, మరువకుమని చెప్పెను.

అబ్బాలుండు పునఃపునః ప్రణామంబు లాచరించి యద్దేవి యానతిన నబ్బిలంబు దూరిపోవుచు నటపెక్కు విఘ్నంబులు, భూతప్రేత పిశాచ వ్యాఘ్ర భల్లూక సర్పాదులు గనుపించిన మనంబుచలింపక యన్నియు నివారించుచు నబ్బిలంబు వెలువడి కొంత దవ్వరిగి యొకరమ్యప్రదేశంబున నిలిచియుండెను.

అంత నబ్బిలంబు వెలువడి గజ తురగ వీరభటులు పెక్కులక్షవార్య ఘోషంబును భేరీ భాంకృతులును కాహళ నిస్వనంబులును శంఖనాదంబులును రథభట బలంబులును ఓష్ట్రఘంటికా ఘణాత్కారంబు

లున్ను, తురగ గజవాహన ధ్వనులు నేకంబై ప్రళయ కాల మేఘ గర్జి
తంబుగ చాల దిక్కులు పిక్కటిల్లు నటుల సూర్యోదయ పర్యంతము
న మాయా బలంబును, అరువది వేలు మద గజంబులు పన్నెండు లక్ష
లుత్త మాశ్వంబులు పదునేడు లక్షలు పదాతి వర్గంబులు మణిమయాభ
రణదివ్యాభరణంబులు పదికోట్ల సువర్ణంబుగా మాధవవర్మకు నిలుజేసెను

—*మాధవవర్మ పద్మాక్షీవరంబున గల్గిన సేనలతో
తల్లి చెంతకు వచ్చుట.*—

ఆరాజ కుమారుఁడు బలంబుల మన్నించి వారి చేసిన సత్కారంబు
లు చేకొని యాబలంబులతోఁ గూడ హనుమకొండ చేరవచ్చి వారలం
దఱిని నిలిపి తానొక్కరుండు పురంబుఁజొచ్చి వచ్చుచుండెను. అట్టితఱి హ
నుమకొండను నేలుచున్న యెఱుకరాజతఁడు వచ్చుటకుమున్దే యాకలక
లంబువిని వెరగుపడి గవనులు వేయించి చారులచే నా సేనాపరిమితి యె
ఱింగి వహాభీతచిత్తులై యెక్కడిసేన వచ్చెనో యని చింతించుచు నెట
కేనియుం బారిపోవ యత్నించుచుండె.

తల్లి కొడుకునుంగానక వెదకి వెదకి వేసారి నేలంబడి మూర్ఛిల్లి
తెలివొందినదై దుఃఖంబుచే పొరలుచుండెను. పూర్వభూసుర దంపతు
లు సిరియాళదేవినిగాంచి దుఃఖోపశమనంబు గలుగునట్లుగా మాటలచే
బుజ్జగింపుచుండిరి. ఆసమయంబున మాధవవర్మ తల్లియగు సిరియాళదే
వినిగాంచి మ్రొక్కెను. పెన్నిధిగన్న పేదచందంబున నామెఁ దిగ్గున లేచి
యుబ్బుమీరి యక్కుమారునెత్తి యక్కునం జేర్చి శిరం బాఘ్రాణించి,
అన్నా! ఎక్కడనుండితివి? బాలుండవు. ఒంటినుండుట యాశ్చర్యంబు గ
దా! నిన్నెడబాసి యీ కేయి నాలుగు ఝాములు మాయొడల ప్రాణం
బులు నిలిచియుండుట పరమాశ్చర్యంబులని దలంచి శోకమోహంబులు
పెనుగొన నశ్రువులని గాగలించి విస్మయంబందుచు భానుబింబము పొ
డుపు గొనియున్న మూర్తిత్రయంబ నంబోలె యిబ్బాలుని మఱొక్క
ఝాముంబు శోకమోహంబు సంతోష విస్మయానందంబులననుగు

చు నబ్బాలునుద్దేశించి మాయయ్యా! ఈరేయి నెక్కడ నుంటివి. ఎరు గంబఱుకుమనెను.

ఆకుమారుండు తానుపద్మాక్షీదేవి నగరికిం జనుటయు, మొదలుం గాగల వృత్తాంతంబంతయు వారలకుంగా సర్వంబు నెరుంగం బలికిన విస్మయానంద భరితుండై యున్న మాధవ శర్మం జూచి యాకుమారుం డిట్లనియె

—* మాధవవర్మ మాధవశర్మయాజ్ఞచేదాను
రాజ్యంబు పరిపాలించుట *—

ఈరాజ్య భోగంబులు మీరలనుభవింపుఁడు మీసమీపంబున నేను ధరా చక్రంబు పాలించు వాఁడనని యబ్బాలుం డొడంబడి పలికిన నాతఁడిట్లనియె.

అయ్యా! మేము వృద్ధులము. నేత్రంబులు పొరలుగప్పి యున్నవి. శ్రోత్రపుటంబులు విననిజశక్తిం జాలవు. కాలుచెయ్యియు నాడుటలేదు. జవసత్వములు నానాటికిం దగ్గుచున్నవి. శ్లేష్మంబులు కండరబలంబుననా గుఁకొని త్రుళ్ళిపా సాదులు సన్నంబయ్యె. మాకు నెక్కడి రాజ్యభోగంబులు. ఎటుల ననుభవించు వారము. నీభోగంబులే మాకు సహస్ర గుణిత భోగంబులనిన, వినియాతఁడు వారలఁజూచి నిట్టూర్పు నిగుడించి తత్క్షణంబె పద్మాక్షీ దేవి నగరికింజను దెంచి యద్దేవి సముఖంబున నిలచి చెయ్యెత్తి, ఓపరమేశ్వరీ! మా మాధవ శర్మకును మా మాధవాంబకును మాతల్లి సిరియాళదేవికిని గాక యీరాజ్య భోగంబులునాకేల? ఖడ్గ ఖేటకంబులివి గోయని ముందఱ బెట్టి చనుచుండెను.

ఆసమయంబున నబ్బాలుని యౌదార్యంబులకు నెంతయు మెచ్చి యద్దేవి యతని చేరంబిలిచి మీ తాత ముత్తవలగు వృద్ధ భూసుర దంపతులును మీతల్లి సిరియాళదేవియునీవురాజ్యంబు పాలింపు చున్నంత కాలంబును వయోయావన ప్రాయంబుల నుండగల వారలని యానతిచ్చి నీవుధరా చక్రంబు నూటయిరువై యేండ్లు పాలించి యట మీ

ర దివ్యకన్యకాకృష్టుండవై యీకొండ బిలంబులో దివ్యాంగనలతో ది
వ్యభోగంబు లనుభవింపుచు నమరత్వంబును నిర్జరత్వంబునుం గలిగి
యుండ గలవని యాసతిచ్చిన యద్దేవికి సాష్టాంగ నమస్కారంబులు చే
సి ఖడ్గ ఖేటకంబుల మగుడ గైకొని వచ్చిమాధవ శర్మకు నావృత్తాం
తం బాతయు నెరుంగం బలికెను. నీవువ్వారు నవ యానను లగుటయు
యీ వృత్తాంబాతయు నెరుక రాజులు విని మాధవవర్మ పాలికింజను దెం
చి యతనికి సాష్టాంగంబుగా నమస్కరించి నీవ్రమాకు రాజువు గలిగితి
వి మాతపంబులు ఫలించెను. ఏమిపనులఁజేయుచుమాని కరంబులు ము
కుళించియున్న వారలను మన్నించి మాధవవర్మ యెనుబది రాజులకు స
మరవాదిరాజ్యంబిచ్చి పంపెను.

తరువాత నబ్బాలుండు దేవీ కల్పితంబులైన సేనలతో తాను హ
నుమకొండకు వచ్చి చేరెను.

మాధవశర్మ సింహాసనం బెక్కుట

శాలివాహనశకము ౭౧౧తారణనా

మసంవత్సర మాఘశు ౫ గురువారము

శ్రవణానక్షత్రంబునుండి (౪౧౧) వరకు

అతఁడుమంచిముహూర్తమున దేవభూదేవపూజలు గావించిభూ
సురాశీర్వాదపూర్వకంబుగాసింహాసనంబెక్కెను. నానా సేనలు నమస్కా
రంబుల జేసిన దివ్యాంబరా భరణంబు లొసంగి సంతోష చిత్తులంజేసి
తమ తల్లియగు సిరియాళదేవి యనుజ్ఞ గైకొని తనతండ్రిని జంపినట్టి ప
గదీర్చుటకై మనంబున దలంచుకొని పూర్వసామంతుల బిలిపించుకొని
వారల మన్నించి తనకు శత్రుండైన కటక వల్లభునిపై దండయాత్ర గదల
వలయునని వారితో విచారించి ప్రయాణ భేరి వేయించి పద్మాక్షి దత్తం
బైన బలంబులు తన్నుగొల్చుచుండగా కటకంబునకు బోయి యాప
ట్టణంబు చుట్టు ముట్టడించెను.

ఆతండొక్క మాసంబు ఘోరయుద్ధంబుఁజేసి దేవీదత్తంబైన ఖ
డ్గఖేటకంబు లిరుగేలం బూనియుద్ధంబునఁ గటకవల్లభుని తలద్రుంచెను.

అప్పుడు మేదినిగల వైరులకుఁ గాలభైరవుండను బిరుదును కటకవల్ల
భుని తలగుండు గండఁడను బిరుదు చెల్లించుకొని వాని సుతునికిఁ బట్టం
బు గట్టి తన యాజ్ఞకులోఁ జేసికొని తన గోగణంబుల పదమూఁడు వే
ల నేనూరు మందలు మగుడి దోలించుకొని మూఁడుకోట్ల సువర్ణ టంక
బు లప్పనంబులు పుచ్చుకొని మరల హనుమకొండకు వచ్చెను. తన
గోగణంబుల కృష్ణాతీరంబుచేరు శ్రీనగరంబున మందలు వేయించి ఆ
మరహాదినున్న మొరుసురాజులకు నప్పన సేయించెను. మఱియు దిగ్విజ
యంబు సేయుటకుఁ బ్రయాణభేరి వేయించి సకల సేనా సమేతుండై
యష్టదిక్కులు జయించి దిగ్విజయంబు గైకొని చోళదేశాధీశ్వరునికూ
తురును వివాహంబై హనుమకొండ ప్రవేశించి సింహాసనాసీనుండై రా
జ్యంబేలుచుండెను.

ఆసమయంబున నాపురినున్న విప్రజనంబులు మాధవవర్మ స
భాముఖంబున కేతెంచి వేదోక్తంబుగా నాశీర్వదించిన వారలకు సాష్టాం
గంబుగా నమస్కరించి వారల బహువిధంబుల పూజించి మీరు కా
ర్యార్థులై వచ్చిన వారలని నామనంబున తోఁచుచున్నది. మీ యభీష్టం
బు లెఱుంగం బల్కుడనెను. ఆవాక్యంబులకు సంతోషించి యా విప్ర
శ్రేష్ఠులనిరి. కటకవల్లభుండు మీతల్లి సిరియాళదేవిని గొని పోవు సమయ
మున నాయాపదగని మీతల్లి చేత నన్నంబు గుడిచితిమి. ఆయాప న్ని
వారణంబుచితంబనియు శివప్రసాదంబనియును గుడిచితిమి. ఇంతే
యేకాక, కలియుగంబున క్షత్రియుల చేత నన్నంబు గుడువరాదు. అగ్ర
జన్ములకు క్షత్రియాన్నంబు తగదు.

ఆకారణంబున మా మనంబునందెప్పుడును మొఱ మొఱ పా
యకయున్నయది. మాకు సప్తగోదావరి మధ్యప్రదేశంబున కొన్ని గ్రా
మంబు లగ్రహారంబులుగా నిచ్చిన నచ్చట స్నాన జప తప హోమం
బులును గ్రతువులును గావించి పుణ్యలోకంబులు వసించెదమనిన నాతఁ
డు సప్తగోదావరి మధ్యప్రదేశంబున నగ్రహారంబులు నిచ్చి పంపెను.

మఱియు మాధవ వర్మ పెద్దకాలంబు రాజ్యంబుచేసి పద్మాక్షీ దేవి వరప్రసాదంబున నొక్క సుతుసంగని పద్మసేనుండని పద్మాక్షీ పేరుపెట్టెను. ఈవిధంబున సమాన దానంబుల మాధవ సేనుండు రాజ్యంబు పాలించె. అంతపద్మాక్షీదేవి పూదోటలోగలనానావిధపుష్పంబులు నిత్యంబును హమకొండ బిలంబులో నుండి వెడలి దేవ కన్యకలు రాత్రిగొని పోవుచుండిరి. తోటకావలి వారలాపుష్పంబులు పోవుటకు వెఱగందియొక్క రాత్రి కావలియుండి దేవకన్యకలువచ్చితెరంగును, పుష్పంబులు కోసికొని మఱుడియోకొండ బిలంబు దూఱిచనుట యుంగనియా వృత్తాంతంబంతియు మాధవ వర్మ కెఱింగించిరి.

అంత నారాజు పద్మాక్షీదేవి వరంబు దలంచి రాజ్యంబునకుంగుమారుడగు పద్మసేనునిబట్టాభిషిక్తుం జేసి యారాత్రి తానొక్కరుండు నా పూదోటలో నున్నయా బిలంబు వెడలిన నాదేవ కన్యకలు చను దెంచి మాధవదేవుని బహువిధంబుల స్తుతియించి పద్మాక్షీదేవి కడకుం దీసికొని చనిరి. తదనంతరంబున బద్మాక్షీ దేనివర ప్రసాదంబున నాతడు కొండబిలంబు చేరం బోయి దేవకన్యకలతో తానునునాబిలంబు జేరెను.

{ పద్మసేనుండు సింహాసనం బెక్కుట
శాలివాహన శకము౪౮౧ నుంచి ౪౮౯ వరకు. }

పద్మసేన మహారాజు తన తండ్రి యైన మాధవ వర్మ బిలంబులోనికి దేవకన్యకల యుక్తముగా జొచ్చిన. యంతరంబున తానును తండ్రివట్లు రాజ్యంబు మహామహిమతో పెద్దకాలంబు పాలించితనకు సంతానంబు లేనందున మిక్కిలి చింతించి బుధాను మతంబున సిద్ధేశ్వర శ్రీమన్మహాదేవుని నిత్యంబును గూష్మాండ ఫలంబుల బూజింప ప్రసాదంబున నొక్కసుతుండు గలిగెను.

అతనికి వెన్నమ రాజను నామకరణం బిడియె తరువాతఁ దనకు మరలబడ్డ కటక వల్లభుని సాధించి వానిసుతునకిఁబట్టంబుగట్టి యెప్పటి యట్లమూఁడుకోట్ల సువర్ణ నిష్కంబులు గైకొని హనుమకొండఁ బ్రవేశించి డెబ్బదియెనిమిది వర్షంబులు రాజ్యంబు పాలించెను. తదనంతరంబున దనకుమారుండైన వెన్నమరాజును బట్టాభిషిక్తుం జేసి తానుశివలోకంబున కరిగెను.

{ వెన్నమరాజు సింహాసనం బెక్కుట. }
{ శాలివాహన శక ౪౮౯ నుండి ౫౭౨ వరకు }

వెన్నమ రాజు సింహాసనం బెక్కిన తరువాత వివాహంబు జేసికొని పెద్దకాలంబు రాజ్యంబు పాలించెను. సుతులు లేనందున సిద్ధేశ్వర శ్రీమన్మహాదేవుని గూర్చి ఘోరతపం బాచరించెను. అద్దేవుని ప్రసాదంబున నొక్కసుతుం డుద్భవించెను. అతనికిఁ బోఁకివెన్నమరాజను నామకరణంబిడెను. తాను సకలదేశాధీశ్వరులను జయించి వారిచే నప్పనంబులుగైకొనెను. ఆతఁడు ముఖ్యపట్టణంబగు హనుమకొండ ప్రవేశించి యెనుబదిమూఁడు వర్షంబులు రాజ్యంబు మహా[వైభవ]ముచేఁ బాలించి తనసుతుండగు పోఁకివెన్నమరాజును బట్టాభిషిక్తుం [జేసి తా]నుశివలోకంబున కరిగెను.

{ పోఁకివెన్నమరాజు సింహాసనం బెక్కుట }
{ శాలివాహన శక [illegible] నుండి ౬౪౯ వరకు }

పోఁకివెన్నమరాజు, సింహాసనం బెక్కిన తర్వాత వివాహంబు జేసికొని గుండమరాజను నొక్కసుతుని గని, తనకు శత్రువుండగు కటకవల్లభుని మీఁదికి దాడెత్తి వతనితో మాసత్రయంబు ఘోరయుద్ధంబు గావించి కటకవల్లభుని శిరచ్ఛేదనంబు గావించెను. వాని సుతునకి బట్టంబుగట్టి యెప్పటియట్లు సువర్ణనిష్కంబు లప్పనంబులు పుచ్చుకొని యష్ట దిక్కులయందు జయస్తంభంబుల నిలిపి గుండమరాజును బట్టాభిషిక్తుఁ జేసి డెబ్బదియూఁడు వర్షంబులు సుఖముగా రాజ్యంబు పాలించి తాను శి

వలోకంబున కరిగెను.

{ గుండమ రాజు సింహాసనం బెక్కుట.
శాలివాహనశక ౭౪౭ నుంచి ౭౧౮ వరకు }

గుండమరాజు వివాహంబుఁ జేసికొని యొక్క సుతునిఁ గని యెరుకుదేవరాజు అని పేరుపెట్టెను. తదనంతరంబా గుండమరాజు డెబ్బది సంవత్సరంబులు రాజ్యంబు పాలించి యన్ని దిక్కుల యుప్పనంబులు గైకొని యెరుకు దేవరాజును బట్టాభిషిక్తుం గావించి తాను శివలోకంబున కరిగెను.

{ ఎరుకుదేవరాజు సింహాసనం బెక్కుట.
శాలివాహన శక ౭౧౮ నుంచి ౭౫౩ వరకు }

ఎరుకుదేవరాజు బాలుండగుటంజేసి యతని మేనత్త కుంతలి రాజ్యంబు జేసెను.

{ కుంతలిదేవి రాజ్యంబు చేయుట.
శాలివాహనశక ౭౧౮ నుంచి ౭౩౭ వరకు }

ఈకుంతలిదేవి రాజ్యముచేయు కాలమందు నాసుగుజ రాష్ట్ర మహారాష్ట్రంబులపై దండు వెడలి వారల సాధించి వారలచే యుప్పనంబులు గైకొని మగుడి తనపురంబగు హనుమకొండకు వచ్చి మరల బద్దకటకవల్లభునిపై చతురంగ బలంబులను గూర్చి రాణా గంగిదేవుని సేనాధిపతిగా నియమించి పంపెను. అతఁడు కటకవల్లభునితో మహాయుద్ధంబుఁ జేసి కటకవల్లభుని దునిమి వాని సుతునికిఁ బట్టంబుగట్టి యెప్పటి యట్లు మూడుకోట్ల సువర్ణంబులు యప్పనంబులు పుచ్చుకొని వచ్చెను. అంత కుంతలీదేవి యాతని సన్మానించి నిర్వ్యాక్ర పరాక్రమముతో నవవర్షంబు లరాజ్యంబుఁ జేసి యెరుకుదేవరాజునకు రాజ్యభారంబు నతని కప్పగించి తాను శివలోకంబున కరిగెను.

—*ఎరుకుదేవరాజునకు భువనైకమల్లుండను కుమారుఁడు గలుగుట *—

ఎరుకుదేవరాజు సర్వలక్షణ సంపన్నుండై దేవగిరి పైదండు వె

షణి దేవగిరిరాజుల గెల్చి యారాజు కూతురిని వివాహంబై వారిచేకా
నుకలుగైకొని మరలపురంబు ప్రవేశించెను. అంత నెనుక రాజునకొక్క
సుతుండుద్భవించిన నతనికి భువనైకమల్లుండను నామకరణంబు జేసెను.
తరువాత నాతఁడు చతురంగ బలంబులతో విజయ నగరంబుపై వెడలి
యారాష్ట్రంబేలు వీరనరిసింహ రాయుల గెలిచియతనిచే నప్పనంబులు
గైకొని మగుడి హనుమకొండ ప్రవేశించి డెబ్బదినాలు గేండ్లు రా
జ్యంబుపాలించి భువనైక మల్లుని సింహాసనాసీనుంగావించి తానుశివ
లోకంబున కరిగెను.

{ భువనైకమల్లుండు సింహాసనం బెక్కుట. }
{ శాలివాహన శక ౭౯౩ నుంచి ౭౧౭ వరకు }

ఈభువనైక మల్లుండు సింహాసనం బెక్కి తమకు శత్రుండగు కొ
టకవల్లభుంపై వెడలివాని తోమహా యుద్ధంబుగావించి వానినిసంహ
రించి వానిసుతునకుఁ బట్టంబుగట్టి యెప్పటియట్లు మూడుకోట్ల సువర్ణ
నిష్కంబులు నప్పనంబులు పుచ్చుకొని హనుమకొండ ప్రవేశించెను. పి
మ్మట దక్షిణదేశం బేలు వీరనరసింహ రాయుని సకలమర్త్య గండ బిరు
దుగలవానినిగాను, ధరణీవర బిరుదు గలవానిని గాను, చారులచేవిని చ
తురంగ బలంబుల గూర్చుకొనిపద్మాక్షీదేవీవరలబ్ధంబులైన ఖడ్గ ఖేటకం
బులు యిరుగేలంబూని విజయనగరంబు చుట్టునుంజుట్టి యాభువనైకమ
ల్లుండు విజయనగరంబుజొచ్చి నరసింహ రాయుల గృహద్వారంబు చొత
కుఁదురగారూఢుండై ఖడ్గ ఖేటకంబులతోఁబోయినరసింహ రాయులనుడన
తో నేకాంత యుద్ధంబునకురమ్మనిభటులచేఁ బిలిపించెను. అంతనాతఁడురా
కపోవుటచే బలంబుల నప్పురంబు వెలుపలనుంచి తానొక్కరుండు నిర్భ
యంబునఁబురంబు జొచ్చి నరసింహరాయల సన్నిధికిరాగా నాతఁడు
నిర్భయంబునవచ్చుటకు జాలకొనియాడియితనికి భువనైకమల్లుండను నా
మంబు సహజంబగునని కొలువుననుండి దిగ్గునలేచి యంతఃపురంబు ప్ర
వేశించి తల్లిపత్నియుఁ దానును భువనైక మల్లునినెదుర్కొనిరి.

—* భువనైక మల్లుని వివాహము *—

పిమ్మట నాదంపతులతని పాదంబులఁగడిగిరి. తనసింహాసనంబుపై గూర్చుండ నియమించి కరంబులు ముకుళించియున్న నరసింహా రాయలు భువనైక మల్లున కిట్లనియె.

ఓమహాత్మా! నీవంటినిశ్శంక వీరులకుగాక యీ బిరుదులు మాబోటిరాజులకుఁ దగవు. ఈబిరుదులు నీవుగైకొమ్ము. నేనోడితిని. నీవుగెల్చితివి అనితనబిరుదులు సువర్ణ ఫలకాంకితంబుగా వ్రాయించి భువనైకమల్లునకు గానుకగానిచ్చి తన చెలియలగు శ్రీరంగమ దేవిని సర్వాభరణ భూషితుగాఁజేసి విలాసవతులగు పదుగురు చెలికత్తెలతోఁగూడ భువనైకమల్లునకు వివాహంబుఁ జేసెను.

—*వీరనరసింహారాయులు శ్రీరంగమదేవి కరణమిచ్చిపంపుట.*—

తరువాత మూడుమాసంబులుభువనైకమల్లుడునరసింహరాయుల గృహంబున నిలిచెను. మరియు నుత్తరపు గవినినుండి నరసింహారాయులు భువనైకమల్లున కరణంబు లిచ్చుటయు, శ్రీరంగమ దేవులకు కాంచీపురం బాదిగాఁగలచోళరాజ్యంబేలు పనుపునకు చదివించుటయు అంతట దేవి యుక్తంబుగా దివ్యభూషణ చీని చీనాంబర గజ తురగ గోగణ దాసదాసీ పరి జనంబులనిచ్చి పంపు సమయంబు మీమా యింటికి తరతరంబు విరోధంబు లేదని ప్రమాణంబులు జేసికొని సువర్ణ ఫలకాంకితంబు వ్రాసికొని తెల్లుసమయంబున శ్రీరంగమ దేవి తనపతియైన భువనైకమల్లునితో నిట్లనియె

ఏను బాల్యంబుననుండి బుధానుమతంబున సర్వలక్షణ సంపన్నుఁడు మహారాజు నాకు పతియగునని పుణ్యంబు దయ చేసిన దేవుని మనతోడనే వేంచేయ సెలవుదయ సేయుమని విన్నవించ వాతఁ డంగీకరించెను. తరువాత నామె యాపాంచాల రాయుని బంగారు పల్లకిలో నుంచుకొనివచ్చి యద్దేవుని పేర గ్రామంబును కటకంబును గట్టించి దేవుని

నైవేద్యంబులకు పదకొండు గ్రామంబులు నడిపించెను.

—*భువనైకమల్లుండు హనుమకొండ ప్రవేశించుట. *—

అంతట భువనైకమల్లుండు శ్రీరంగము దేవిని తీసికొని గంగాపురంబునకువచ్చి యక్కడమీనాంబకుండమనుఋషిచే నాగ్రామమధ్యంబున నూరుగుళ్లు కట్టించెను మఱియుఁ జెన్నరాయుల ప్రతిష్ఠ చేసెను. ఒక కోనేరు కట్టించెను. ఎనిమిది తులాభారంబులు దేశయుక్తంబుగా దూగెను. అట్టిద్రవ్యంబులువిప్రులకు దానంబుచేసి హనుమకొండప్రవేశించెను.

అంత భువనైకమల్లుండు శ్రీరంగమ దేవులయందు త్రిభువనైకమల్లుని పాంచాలియను కొమార్తెనుగని పరమసంతోషంబునఁనుండెను.

—* వెంకట నాథుఁడు యుద్ధమునకు బయలు దేరుట. *—

అట్టియవసరంబున నిక్కడ వీరనరసింహరాయలకుమారుండు వెంకట నాథుండువిజయనగరంబేలుచు నొక్కనాడు పరిజనసమేతుండై స్వారి వెడలి పూర్వదక్షిణ పశ్చిమ రాజప్రజాన్వయముగా వచ్చి ఉత్తరద్వారంబున రాజప్రజాన్వయముగాన రాదని ప్రధానులనడిగెను. వారలాయుత్తరపుగవినినుండినాతనితండ్రివీరనరసింహారాయలుభువనైకమల్లునకరణంబులిచ్చుట మొదలుగాగల తద్వృత్తాంతంబులయు నెరుంగం బలికిన వెంకటనాథుండు విని నవ్వి యేమినటులనే హనుమకొండకు బోయి భువనైకమల్లుని నేకాంత యుద్ధంబునకు బిలిచెదనని ప్రయాణభేరి వేయించెను.

—* శ్రీరంగమదేవియుద్ధంబు సవారించుట *—

ఆసమయంబునభువనైకమల్లుం డీవృత్తాంతంబు చారులచేవిని సర్వబలంబులఁ గూర్చుకొని దేదీప్యంబైన ఖడ్గఖేటకంబు లిరుగేలంబూని వెంకటనాథుండు తనమీదికివచ్చుచున్న వాఁడనివిని శ్రీరంగమదేవులకుఁ జెప్పంబోవు సమయంబున శ్రీరంగమదేవి పతికి నీరాజనం బిచ్చుచు కన్ని

రు దీసికొన భువనైకమల్లుం డిట్లనియె.

సతీమణీ నీవు పుణ్యాంగనవై నాకు నీరాజనంబిచ్చి దీవించు సమయంబున కన్నీరు దీసికొన కారణం బేమియని యడిగిన నాతనితో శ్రీరంగమదేవి యిట్లువిన్నవించె.

తొల్లి మీరును మాయన్నయగు వీరనరసింహ రాయులును సఖ్యంబు జేసితిమని బ్రాహ్మణాగ్ని సమక్షంబున సువర్ణ ఫలకాంకితంబుగా వ్రాలుపెట్టితిరి. అట్టిసత్యంబు దప్పితిరి. మీజిహ్వకు సత్యంబు దొలగెను నీ వీర నరసింహ రాయులకు వెంకట నాధుం డొక్కడే సుతుండని వెలిపిపాదములబడెను.

## —* భువనైకమల్లుడు బ్రాహ్మణుల కగ్రహారములిచ్చుట *—

అంతనామెవచనంబులకు సంతసించి యతండు వైరంబుచాలించి బుధ జనులచే కార్యం బూహించి యాతడు తన రాజ్యంబుపై రాకుండు నట్లు తన రాజ్యంబు చుట్టుగా రాజ్యంబునకు చక్రాకారంబుగా వేయిగ్రామంబులు భూసురుల కగ్రహారంబులుగా నిచ్చిపంపెను

## —*వెంకట నాధుండుహనుమకొండకు వచ్చుట.*—

భూసుర లతిత్వరితంబున వెడలి నెల్లూరుకడకు వచ్చియున్న వెంకటనాధునిగని యిది మావిప్రముఖ్యుల కొసంగిన యగ్రహారంబులు. ఈ భూములు త్రొక్కవలదని ఆనకట్టగా అంత వెంకటనాధుండు తనమేనత్తయగు శ్రీరంగమదేవులు పంపిన రహస్యపత్రికలు చదువుకొని వైరంబుమాని వారితో బాంధవంబునొందితిమని చెప్పియావిప్రులకుఅగ్రహారమధ్యంబునమార్గంబిచ్చుటకైయాభివేలమాడలు సమర్పించినవార లొడంబడనాతండుశ్రీరంగమదేవినిజూచెదనని హనుమకొండకు చనుదెంచెను.

అంతభువనైకమల్లుండు దేవీయుక్తంబుగా నెనిమిదియోజనంబు లెదురుగావచ్చి వెంకటనాధుని మహా వినయభక్తి పూర్వకముగా పూ

జించి తమకు రాజధానియగు హనుమకొండకు దోడ్తెచ్చి యప్పురంబు
న మాసద్వయంబు నిల్పి పురంబు అంతఃపురంబు శృంగరించి తమ పు
త్రియగు పాంచాలిని వెంకట నాధునకు వివాహంబుజేసి అనేక వస్తువా
హనంబులును అమూల్యాభరణాంబరాదులు కొండవీడు మొదలుగావి
దర్భదేశమున్ను యచ్చెలియా కరణంబిచ్చినరపతిరాయులనుపట్టంబునిజం
బుగాగట్టి దేవీయుక్తంబుగా వెంకటనాధునివిజయనగరంబునకుపంపెను.

భువనైకమల్లుం డిరువదియారేండ్లు రాజ్యంబుపాలించి తనసుతు
డగు త్రిభువనైకమల్లునకు పట్టంబుగట్టి తాను శివలోకంబున కరిగెను

{ త్రిభువనైకమల్లుండు సింహాసనం బెక్కుట
శాలివాహన శకము [illegible] నుంచి [illegible] వరకు }

త్రిభువనైకమల్లుండు సింహాసనం బెక్కి రాజ్యంబు చేయుచున్న
సమయంబున, కాకితదేవినిత్యవిధి పూజానుష్టానంబులు గావించు చుండ
గా త్రిభువనైక మల్లునకు కాకితదేవి వరప్రసాదంబున కాకితపో
లరాజను నొక్క సుతుండుజన్మించెను. ఇట్లుండగా దమకుశత్రుండగు
కటకవల్లభుండు తమపైమరలబడిన వానిపయి దండెత్తి వానిని యుద్ధంబు
నసంహరించి వానిసుతునికి బట్టంబుగట్టి ఎప్పటియట్లు మూడు కో
ట్లసువర్ణ నిష్కంబు లప్పనంబులు పుచ్చుకొని వచ్చి గంగా పురంబు
కొరతయైన దేవతానివాసంబులు పూర్తిగాగట్టించి డెబ్బది నాలుగుసం
వత్సరంబులు రాజ్యంబు పాలించి కాకితపోలరాజునకు పట్టంబు గట్టితా
ను శివలోకంబున కరిగెను.

{ కాకితపోలరాజు సింహాసనంబెక్కుట
వాహన శక [illegible] నుంచి [illegible] వరకు }

కాకితపోలరాజు బాలుండగుటంజేసి యతని సరదార్లుసామంతు
లును విముఖులగుటను విని కటక వల్లభుండు విశ్వనాధ దేవు దళవాయి
గా జేసిపంప నతండువచ్చి హనుమకొండ ముట్టడివేసి పండ్రెండువర్షం
బులుండెను. అంతకాకితపోలరాజు తనపురంబునాప్తవర్గంబునకప్పగించి
పురంబువెలువడిదొరలను సరుదార్లను వెంబడించుకొనికటకవల్లభునిపయి

దండయాత్రజని కటకవల్లభునితో యుద్ధంబుఁజేసి వానితలద్రుంచి వాని సుతునకి బట్టఁబుగట్టియెప్పటియట్లు ప్రతిసంవత్సరము కోట్ల సువర్ణ నిష్కంబులు పుచ్చుకొనుచు హనుమకొండఁ ప్రవేశించికటకవల్లభుండదళంబుల బారదోలెను.

* కాకితపోలరాజునకు సువర్ణమయంబగు శంభులింగంబు కనుపడుట *

పిమ్మట గంగాపురంబుఁజేరి గడమ యైన దేవాలయంబులు గట్టించి చెన్నరాయుని ప్రతిష్టచేసి యక్కడ నొక్కకోనేరు గట్టించెను. మరి యొకనాడా రాజు సముఖమునకు త్రిదండియనుముని యేతెంచిన వారల బహువిధముల పూజించి వారిచే వారియాశ్రమ మహాత్మ్యంబువిని యచ్చటను శివాలయంబులుగట్టించెను రాజ్యంబేలుసమయంబున నొక్కనాడా రాజు పట్నంబున గ్రాసార్థులైన పరిజనంబులు శకటంబు నకు రక్షకులై యుండ రాత్రి వచ్చునెడనాగ్నేయ భాగంబున కోశద్వయ దూరంబున నిర్నిమిత్తంబున వచ్చుబండి యూరక నొరగిలబడెను. ఆరాత్రి శకటంబు చక్రం జేయు రామికి వారచ్చట నిలిచిన వేకువయు బహు జనంబుల గూర్చుకొని యాబండి చక్రంజేయు సమయంబున యాబండికమ్మి శుద్ధసువర్ణంబగుటయు జూచి యాసువర్ణంబు తమకులభింప కుండుటం జేసియు శీఘ్రింబున కాకితపోలరాజున కెరిగించిన విస్మయానంద భరితుండై అతిత్వరితంబున బుధజన పురోహితామాత్యులతో నచ్చటికి చనుదెంచియచ్చటపాతించినపరుసవేదియగు శంభులింగంబు గనుపట్టె.తజ్జ్యోతిర్మయంబగు సువర్ణలింగంబును హనుమకొండకు గొనిపోవ నుద్యోగించిన యాదేవుండు ఒరల కుండిన చింతించి కాళేశ్వర నివాసులైన రామారణ్యశ్రీపదులును మహేంద్ర శ్రీపాదులును హిడింబాశ్రమ నివాసులైన త్రిదండి ఋషులనున్ను బిలిపించి వారల నెదుర్కొని యత్యంత వినయభరితులై యర్ఘ్యపాద్యంబుల బూజించి యాదేవుని జూపెను.

—* కాకితపోలరాజుఓరుగల్లుపురంబు నిర్మింపఁజేయుట. *—

అంత వారలత్యంత హర్షంబుగా యద్దేవునికి విభూతిధారణంబుఁజేసి అద్దేవుండు మధ్య ప్రదేశంబున నుండునట్లుగా గొలిచి యోజవిన

స్తారంబుగా పురంబు గట్టందలంచి శాలి వాహన శకవర్ష ౯౦౯ యగు శుభకృతునామ సంవత్సర కార్తిక శు ౫ గురువారంబున రోహిణీ నక్షత్రంబున ఓరుగల్లు పట్టణంబు గట్టిరి.

ఆపురి యభేద్యం బగునట్లుల రామారణ్య శ్రీపాదులు దలంచి శ్రీవిద్యాక్రమంబును యంత్ర ప్రకారంబుగా కోటకు రేఖలు వ్రాసి చుట్టును ప్రహరిగోడ గట్టించెను.

హనుమకొండద్వారమునుండిస్పర్శవేదియగుశంభులింగంబు నగరి పర్యంతంబు రెండు కోసులవీధి యేర్పరచి యుభయ పార్శ్వంబుల దేవాలయంబులు ముక్తీశ్వరుండును శ్రీవిశ్వనాథుండును భీమేశ్వరుండును విరూపాక్షుండును, రామేశ్వరుండును మొదలుగాగల ఈశ్వర స్థానంబులు యిన్నూట యేబది యును వెంకట నాథుండును శ్రీరంగ నాయకులును, గోపాలుండును, పాంచాల రాయుండును, ఆదిగాగల విష్ణుభవనంబులు నూరును దేవీభవనంబులు ఏబదియు, వీరభద్ర వినాయక భైరవ భవనంబులు నలువదియును, గట్టించెను. ఈదేవతలకుం బ్రతిష్టలు చేసి రామారణ్య శ్రీపాదులు కాకితిపోలరాజుతో నిట్లనిరి.

నీవునిత్యంబును శంభులింగంబు పూజానంతరంబున లోహముస్పర్శచేయించిన నదిశుద్ధ సువర్ణంబగు. అదినీవుసత్యవినియోగంబు చేసికొమ్మనిన, నారాజు బారువు తెరంగె రింగించు మనెను. ఆరామారణ్య శ్రీపాదులట్లకాకయనుచు యాబారువ్రలలెక్క వినుమనిరి.

నూటయిరువది గురిజలమెత్తు నెక్కతుల మానం బగు. అట్టితులములు నూటయిరువదియొక్క వీసె యనంబడు. అట్టి వీసెలు నూటయిరువదియైన బారువ యనంబడు. ఇదికలియుగ వ్యవహారపు బారువయని యెరుంగ బలికి రాజుచే ననుజ్ఞాతులై కాళేశ్వరంబునకు ఋషులు జనిరి.

అంతకాకిత పోలరాజు మునుల యనుజ్ఞవడసి నిత్యంబును నమోమయంబు బారుస దెప్పించిజ్యోతిష్కరంబై పరుసవేదియగు నాలింగంబునకు స్పర్శచేయించిన నదిశుద్ధసువర్ణంబైన ఆద్రవ్యంబు దేవబ్రాహ్మణకార్యార్థంబు గానిత్యవినియోగంబు చేయగా నెక్క సుతుండుద్భవించెను.

## —* రుద్రుని చరిత్ర *—

ఆవేళ సటింగి భూసురు లేకాంతంబునకు కాకిత పోలరాజును బిలచి ఈ బాలునిచేత నీవు మృతిఁబొంద గలవు. బాలుని ఛేదించు మనిరి. ఆమాట భూపాలుండు విని తన దేవియుం దానును నబ్బాలుని మధ్యరాత్రియందుఁ బరులెవ్వ రెఱుంగ కుండునట్లుగఁ గొని పోయి శంభుదేవుని ముందటి మంటపంబునఁబొత్తిల బరచి యాబాలునికి స్తన్య పానంబులు చేయించి పొత్తిలయందు నబ్బాలుని నునిచి యిద్దరు దంపతులు నిజనివాసంబునకు జనిరి.

అంతనాఁగుడి కావలివారలేతెంచి యాశిశువుంజూచి యాశ్చర్యచిత్తులై రాజసముఖంబునకు నేతెంచి యబ్బాలుని తెఱం గెఱింగించిరి.

భూపాలుండును విని యెఱుంగనియట్లాశ్చర్య చిత్తుండై పుత్రమోహంబు మనంబునం బెనంగొనఁ బురజనుల యట్ల తానును శంభు నగరికింజని యబ్బాలునింజూచి కటకటంబడి పెద్దపూజారిం బిలచి యిబ్బాలుండు సర్వలక్షణ సంపన్నుండు. వీనిని రహస్యంబున బోషించు మని రుద్రజియ్యకు నొప్పనఁజేసి యబ్బాలునకు రుద్ర నామంబు బెట్టి బిల్చుచుండెను. అంత నబ్బాలుండు దినదిన ప్రవర్ధమానుండైనం జూచి రాజశేఖరుండు విధ్యుక్త ప్రకారంబుగా నుపనయనంబు చేయించి క్రమంబున నబ్బాలునకు వేదాధ్యయనాది సకల శాస్త్రంబులును, ధనురాది సాధనాభ్యాసంబులును జపతప మంత్రంబులును చేయించుచుండెను.

అంత నబ్బాలుండు నవయవ్వనుండగుట తోడనే నాభూపాలుండు కొమారునిం బిలిపించి బహు విధంబుల గారవించి యాతనికి నిద్దఱు భటుల కొలువుండఁజేసి వారికిఁ గట్టడిజేసి పరులెవ్వరు తనయాజ్ఞలేక శంభులింగంబు నగరుఁజొచ్చి రేని శాసించుమని యాజ్ఞాపించి పంపెను. అక్కుమారుండు రాజానుమతంబున సకల వైభవంబులుగొని శంభులింగంబు నగరికింజని రాజాజ్ఞ క్రమంబున నచట నుండెను.

## —* మహాదేవరాజు చరిత్ర *—

కాకతిపోలరాజునకు మఱియొక్క సుతుం డుద్భవించెను. అతనికి మహాదేవ రాజని నామకరణంబుం జేసెను. అంతయా మహాదేవరాజునకు మహారోగంబు బొడమిన విద్వాంసులం గోడి తెచ్చి వారలు దీని నివృత్తిగా బరిహారం బెఱింగి వైనవేల పుట్లతిలలు పర్వతాకారంబుగాం బోయించి తదగ్రంబున పన్నెండు మాణుగుల కాలపురుషుడను ప్రతిమ ప్రతిష్ఠించి అరుణపుష్పాక్షతలు అనేక వస్త్రములు నలంకరించి పదిలక్షల సువర్ణ నిష్కంబులు దక్షిణలొడ్డి తమపురోహితుల బిలిపించి యిందుకు తగిన ఫలదానంబు లిప్పింపు మనిరి.

ఆసంగతివిని పురోహితుఁడు రాజుతో నిట్లనెను. ఈపురంబుననున్న విప్రులందఱును దేవరవారిచేత దానంబులు పట్టినవారలు కానపట్టరాదు. మన పురంబున నొక్క బ్రాహ్మణుండు దూదికేశవపిన్నయ్య యనువాఁడు శుక్లభిక్షు చేయుచు నెవ్వరిచేదానంబు పట్టకొల్లక యున్నవాఁడు. అతనినిమీరు పత్నీసమేతులై తద్గృహంబునకుం జని ప్రార్థించుడనిన, నతండు దానంబంగీకరించునని చెప్పిన, నారాజు పత్నియుం దాసును నుపవసించి ధవళవస్త్రంబులు గట్టుకొని విహితకార్యంబు నివర్తించి యా రాజదంపతులు మధ్యాహ్న సమయమున దూదికేశవ పిన్నయ్య గృహంబునకుం జనిరి.

### *దానపరిగ్రహణమున దూదికేశవపిన్నయ్య బ్రహ్మరాక్షసుఁ డగుట*

ఆవిప్రుండు వైశ్వదేవ బలిహరణంబు గావించి చను నప్పుడు రాజు తనదేవియుందానును దమకు బుత్రభిక్ష చేయుమని దానలాభంబుల ప్రార్థించిన, నావిప్రుండు వారల వాక్యంబులు ద్రోయక దానంబు పరిగ్రహించెను. ఆరాజకుమారునకు మహారోగంబు నివారణంబయ్యె. అంత దూదికేశవ పిన్నయ్య బ్రహ్మరాక్షసుం డగుటయుంగని కాకతి పోలరాజు యతనిసతీ సుతులను బిలిపించి యపార ద్రవ్యంబు లొసంగి బహుజనంబుల సహాయంబుచేసి వారణాసికింజని తద్దోష విముక్తి జేసి కొమ్మ

సెను. తదాజ్ఞా ప్రకారంబున వారణాసికిం జని సకల జనంబులుఁజూడఁదూదకేశవ పిన్నయ్య పుణ్య లోకంబున కరిగెను.

—*రుద్రమహారాజు తనతండ్రియగు కాకతిపోలరాజును జాపుట *—

తదనంతరంబున కాకతి పోల రాజు డెబ్బది రెండు వర్షంబులుమహా మహిమ శోభిల్ల రాజ్యంబుఁ బాలించెను. అతఁడు షట్కాల శివపూజాపరుఁడు గావున నొక్క నాఁడు మధ్యరాత్రి శంభులింగంబు నగరికరిగి. పడిలంబున సింహ ద్వారంబున నిలిచి యొక్కరుండ మంటపంబునకుం జని ద్వారంబునకు నడ్డంబుగా నొక్క మహానీయ తల్పంబునం బవ్వళించి సుఖ సుప్తుండైన సుతుం గాంచి, యతని పూర్వ రేఖలు చూచి శంకటంబడి పుత్రమోహంబున నిద్రభంగంబు గాకుండు నట్లు తలుపులు ఒరగిలం జేసి యద్దేవుని సముఖంబునకుం జని పూజగావించి తీర్థప్రసాదంబులు గైకొని మగుడ వచ్చుచుండెను. అంత విధివశంబునం గాకతిపోలరాజు జంఘలు సుతుఁడగు రుద్ర మహా రాజు బొటనవ్రేలుకు తాకెను. అంతనాతఁడుదద్దరిలి లేచి ముచ్చు ముచ్చుయని యరచుచు తనచేతి సురియచే బొడిచిన, నతండు రాజగుట నెఱింగి గడ గడ వణంకుచునాయుధంబుదీయక నిలుచుండెను.

అప్పుడా రాజు గుడివెలుపల నున్న జనులకు మంత్రి పురోహిత సామంతులం బిలువుండని యానతిచ్చి యత్యంత భయాకులితచిత్తుండై యున్న తనపుత్రునింజూచి నీవుభయ పడకుమని వచించెను. వానిదగ్గరకుబిలచి గాఢాలింగనంబుజేసి నీవునాగర్భంబున బుట్టినసుతుండవని పూర్వవృత్తాంతంబు దెలియఁబలికెను. పుత్రా! యింతవిచారమేలిది నీవుచేసిన పనిగాదు. తనకొరకు విచార పడకుమని గారవించెను.

—* రుద్ర మహారాజు పట్టాభిషేకము. *—

భృత్యులతోడవచ్చిన పురోహిత ప్రధానులకు రాజాపోటుచూపి యతండు తన గర్భజాతుం డగుట దెలిపి వీనికిఁ బట్టంబు గట్టుడని చెప్పి

తత్క్షణంబే రుద్ర మహారాజును పట్టాభిషిక్తుం జేసెను. పద్మాక్షీదేవి వర ప్రసాదంబున ఖడ్గఖేటకంబులు సింహాసనమున నిడి గండపెండేరమును సతని కిచ్చి దివతిరియంబులిచి కాకతిపోలరాజు కైలాసనివాసుడయ్యెను.

{ రుద్రమహారాజు సింహాసనం ఎక్కుట.
శాలివాహన శక ౯౬౪ నుంచి ౧౦౧౭ వరకు. }

రుద్రమహా దేవరాజు పట్టాభిషిక్తుండై రాజ్యం బేలుచుండి మైలారు దేవరకు నెడ్డపల్లి వినాయక దేవరకును ముగిలి చెర్ల యేక వీరాదేవికిని గుళ్ళు కట్టించి ప్రతిష్ఠలు చేయించెను. తనయాజ్ఞకు మతల బడ్డ కటక వల్లభునపైఁ జని వానిని సంహరించి వాని సుతునకు పట్టంబు గట్టి రెండుకోట్ల సువర్ణ నిష్కంబులు నప్పనాబులు పుచ్చుకొని ఫలసాట పృథ్వీశ్వరులపై దండు వెడలి వారిని సాధించి వారివద్ద వరహా లప్పనంబులు పుచ్చుకొని మగుడి పురంబు ప్రవేశించెను.

తరువాత తండ్రినిఁ బొడిచిన దోషంబు విముక్తియగునట్లు జగదాచార్యును మతంబునఁ గాశీవిశ్వనాథుని పూజాప్రకారంబులు మహామహిమగాఁ జేయుంచెను. మఱియు శ్రీనగరంబునకుఁబోయి మల్లికార్జునలింగంబు సేవించెను. అచ్చట నెనిమిది తులాభారంబులు దూగి కోటిసువర్ణంబులు దానంబులు చేసెను. అనంతర మేకశిలానగరంబునకు వచ్చి తత్పుర మధ్యప్రదేశంబున ముప్పది మూడు కోట్ల సువర్ణంబులు తెప్పించి సహస్ర లింగంబుల శివాలయంబులు గట్టించెను. మఱియు హనుమకొండను సహస్ర స్తంభముల గుడి యును మఱియుఁ బెక్కు దేవాలయంబులు కట్టించెను.

అందు రుద్రేశ్వరుల ప్రతిష్ఠలు చేసెను. దిగ్విజయంబు చేసెను మగుడి పురంబునకువచ్చి తన తమ్ముఁడైన మహాదేవరాజు దుర్మతంబు నెఱింగి యతని గిరిచేయించెను. తనకు సంతానంబు లేకునికిఁ జింతించి శ్రీశైలంబునకు భక్తియుక్తుండై చని శ్రీమల్లికార్జున లింగంబు సేవించి యక్కడనున్న సిద్ధులకును మఠాధిపతులకును నానావిధవస్తుసము

దయంబులిచ్చివారలచిత్తంబునకు మోదంబుగలుగజేసెను. ప్రసన్నంబగునట్లుగాఁ బూజలు చేసెను. అంత వారల ప్రసాదంబున నొక్క సుతుండు గలిగెను. ఆతనికి గణపతి దేవుండని నామ కరణం బిడియె. మఱియు గొందఱు సుతులుం గలిగిరి.

పాండ్యదేశాధీశ్వరునిపై దండయాత్ర గదలి వానిని సాధించివాని సుతునికిఁ బట్టంబుగట్టి వానిసుతునిచే గోటి సువర్ణ నిష్కంబులప్పనంబులుగొని సేతుబంధు రామేశ్వరంబున కుంజని ధనుః కోటి తీర్థంబునాడియచ్చట నెన్మిది తులాభారంబులు దూగి మగుడి యేకశిలానగరంబు ప్రవేశించెను.

{ మహాదేవరాజు (రుద్రమహారాజుతమ్ముఁడు) సింహాసనం బెక్కుట.
శాలివాహన శక ౧౧౧౭ నుం౧ ౧౧౨౧ వఱకు }

అంత మహాదేవరాజు కొందరి పరి జనంబుల వశంబు చేసికొని రుద్రమహా దేవ రాజును బొడిచి తనకుఁ బట్టంబు గట్టు మనినవారు మహాదేవరాజుతో నిట్లనిరి. నీవురుద్రమహా దేవ రాజును వధించిన యన్యాయంబున నీకు పట్టాభి షేకంబు పూజ్యంబు గాదు. ఈరుద్ర మహాదేవరాజు సుతునకుఁ బట్టంబుగట్టి నీవు యువ రాజవు కమ్మనిరి. ఆతండట్ల చేసెను. మహాదేవరాజు మూఁడుకోట్ల సేనలతో గణపతిరాజుసహితంబుగా దేవగిరిమీఁదికి దండుపోయి మాసద్వయంబు ఘోరయుద్ధంబుఁజేసెను. అంత దేవగిరిరాజుచే మహాదేవరాజు గతించెను.

{ గణపతిరాజు సింహాసనం బెక్కుట.
శాలివాహన శక౧౧౨౧ నుంచి ౧౧౭౭వఱకు }

అంతట గణపతి దేవుండు తనపినతండ్రిని జంపిన దేవ గిరిరాజు వంశక్షయంబు చేసెను. హతశేషులు భయాకులిత చిత్తులై కోట్ల ద్రవ్యంబులు కానుకబట్టి గణపతిదేవునకు నతని కూతురు రుద్రాదేవిని సర్వాభరణ భూషితుల జేసి కానుక బెట్టిన నాకన్యకను వివాహంబై యేకశిలానగరంబునకు వచ్చెను. తనకు మర్ల బడ్డతమ్ములను ప్రహరించి తాను పట్టా

భిషిక్తుండై ఓరుగంటి శిలాప్రాకారంబు లేర్పరచెను.

తిక్కన సోమయాజి శివదేవయ్యను నీశ్వరునిగఁ జెప్పుట.

అంత నెల్లూరినుండి తిక్కన సోమయాజి గణపతి దేవరాజుచే ననుజ్ఞాతుండై పోవునప్పుడీ రాజుసింహాసనంబున మంత్రియై యున్న శివదేవయ్య గారిసజూపియితఁడీశ్వరుఁడుగాని మనుష్య మాత్రుఁడుగాఁడుగావున రాజ్యభారంబితని యనుమతిని నడుపుమని చెప్పిచనెను.

క. పనుచు నెడదిక్కు మఱియు
జనవర సింహాసనమున సచివాగ్రణియై
దనరెడు శివదేవయ్యం
గనుగొని యారాజుతోడ, గడకంబలికెన్

తే. గీ. వసుమతీనాథ! యీతఁడీ, శ్వరుఁడెగాని
మనుజ మాత్రుండుగాఁడు ప ల్మారు నితని
యను మతంబున నీవురా,జ్యంబు సమ్మి
నేలుమనిచెప్పి యాఘనుఁ, డేఁగెయును. సోమదేవరాజీయము.

గణపతిదేవునికృత్యములు.

తద నంతరంబున గణపతిరాజు శివదేవయ్య యనుమతి గైకొని ప్రయాణ భేరివేయించి బలసమేతుండై మున్నూరువేల సాటిరాజుల గెలిచి వారిని తన యాజ్ఞకు లోనుగా జేసి వారిచే నప్పనంబులు గైకొనెను. అంత నెల్లూరుకిం జని అక్కడ బయ్యన గారిని భేదించి మనుమసిద్ధిరాజు నుదిరిగి యభిషిక్తుంజేసి రెండువేలయేనూరు గ్రామంబు లతనికి చెల్లుజేసి కడమవితన వశంబుజేసి కొనెను. నెల్లూర నొక్క మహాతటాకంబు త్రవ్వించెను. సిద్ధరాజుచేఁ బూజితుండై మగుడి గంగాపురంబునకువచ్చి పెక్కుశివాల యంబులు రెండు గోపురంబులు గట్టించెను. అక్కడ నొక మహాతటాకంబును గట్టించెను.

మరల నేకశిలానగరంబునకువచ్చి నగరిలో ననేక రాజగృహం
బులు గట్టించి తన నగరికి నిటికె ప్రాకారంబు గట్టించెను. ఒడ్డెపాండ్యు
లపై దండువెడలి వారినిసాధించి వారిచేఁ సప్పనంబులు పుచ్చుకొనెను. త
నయాజ్ఞ సఫలంబు చేసికొని శ్రీగిరి దర్శించి మల్లికార్జున లింగంబుసే
వించి పన్నెండువేల సువర్ణ కమలంబుల బూజించెను. పంచారామంబు
సేవించి షోడశ మహాదానంబులు చేసెను. అడపగుండయ్యాను బిలిపిం
చి ఎలుగూరు సర్వమాన్యంబుగా నొసంగి యొక్క మహా తటాకంబు
గట్టించెను.

అంత గణపతి దేవుండు పండితారాధ్యులచే దీక్షగైకొని య
మ్మహా దేశికునకు రెండు గ్రామంబు లొసంగెను.

తన రాజ్యంబునఁ గలుగు గ్రామంబు లొసంగుచుఁ దాను నన్ని
టను శివాలయంబులు గట్టించుచు శ్రీరాములు రాజ్యంబేలిన చందం
బునఁ దనభూమి జనంబులకుఁ జక్కగ సకలవస్తు సామగ్రి సమృద్ధిగాని
చ్చి రాజ్యంబేలు చుండెను.

గుండబ్రహ్మయ్య గారి వ్రతనిష్ఠ

ఒక్కనాడు దక్షిణదేశంబు నుండి గుండ బ్రహ్మయ్య గారు శివ
భక్తి తాత్పర్యులై శరణాగత రక్షణత్వము తమకు వ్రతంబు చేసికొని
శివభక్తిగలిగి యేకశిలా నగరంబునకు బండ్రెండు బిడారంబులు సకల
వస్తువులు నించుకొని గవిచర్ల సమీపంబున సకల వ్యవహారంబులు
సలుపు చుండెను.

అంత శ్రీమన్మహా దేవుండు వారల వ్రతంబు చూచుటకై కా
లునిం బంపెను. అక్కాలుండు చోరరూపంబు దాల్చి గణపతి దేవుని
నగరికిఁ కన్నంబువేసి సమస్త వస్తువులు సామాగ్రి వ్రచ్చిలివచ్చు చుం
డెను. అంత నగరి కావలి వారలెఱింగి యాచోరుని వెంబడించిరి. కా
ని యాచోరుండు వారలకు జిక్కక పురంబు వెలువడి గవిచెర్లనున్న
గుండ బ్రహ్మయ్యగారి కడకేగెను. తనవెంట బరతెంచు చున్న రాజ

భృత్యులం జూచి తాను తస్కరుండ ననియు రాజగృహంబు నకు గన్నంబు వేసిన వాడననియు నెట కేనియు బారిపోవు నను యంబున మిమ్ము లగని శరణంబు జొచ్చితి కావుండని దీనాలాపంబులు బలికి ప్రార్థించెను. అంతనాతండు తస్కరుని భయంబు గనుగొని వాని దగ్గిర కుం బిలిచి వెన్ను జరచి యాభయం బిచ్చి వణుగకుము మావెనుకకు దీసికొనెను.

అంతట రాజ భృత్యులేతెంచి, యాతండు తస్కరుండు అతని బట్టుటకై మేము వచ్చిన వారలము. నిలువు నిలువు మనిన వారలతో నాతండు తాను శరణాగత రక్ష కర్త్వం బను వ్రతంబుగైకొంటి ననియు నీతస్కరుండు మాకు శరణుజొచ్చిన వాడనియు నీతస్కరుని మీకు నివ్వకుండుట నిజంబని బలికెను.

### — రాజు గుండ బ్రహ్మయ్యను కొరత వేయుట. —

అంత రాజభృత్యు లతివేగంబునం బర తెంచి యాభూపాలునితో జరిగిన వృత్తాంతమును విన్నవించిరి. ఆభూపాలుండు విసుగుండ బ్రహ్మయ్యను రావించి చోరుని యిమ్మని యడుగగా నాతండు రాజుతో ని ట్లనెను. మేము శరణాగత రక్షకత్వంబను వ్రతంబు గైకొన్న వారలము ఈతస్కరుండు మాకు శరణుజొచ్చిన వాడు, వాని నియ్యకుండుట నిజంబు మీరెట్లు దండన విధించినను సరియే. ఇంతయేల చంప దలచెద రేని యాచోరునికై మాయిరువుర ప్రాణంబు లిచ్చెదము గైకొనుమని పలికెను. అట్లకాకయని పరిజనంబులతో వీరలం గైకొని వీరలా శీర్వాదంబు గైకొని శూలప్రాప్తులం జేసి యాచోరుని విడువుండని యాభూపాలుం డాజ్ఞాపించెను.

అంత పరిజనంబు లేతెంచి వారలందోడ్కొని పోయి గవి చర్లకడ శూలంబులు పాతించి కొరత వేయునప్పుడాపురిగల శివ భక్తులును, బ్రాహ్మ పురుషులును, బ్రాహ్మంగనలును, మఱియు నానాజనంబు లేకంబుగా గూడి చోరుని కై తమప్రాణంబు లిచ్చుగుండ బ్రహ్మయ్యగారిని జూ

డాజను దోచిరి. అట్టి సమయంబున గుండ బ్రహ్మయ్య గారు తన వ్రతంబు కడ తీరచెల్లెనని సంతోషచిత్తులై శివలింగంబు బూజించి శూలంబులపైఁ బడినఁ గుచిమ కోమలా కృష్ణంబు లైయుండెను.

— * శివుండు ప్రత్యక్షం బగుట * —

అప్పుడు శ్రీమన్మహాదేవుండు ప్రత్యక్షంబై పుష్పవృష్టిఁ గురియుచుండ వారల విమానారూఢులగు మన గుండ బ్రహ్మయ్య గారిట్లనిరి. మేము శరణాగతుని విడిచి యెట్లు విమానం బెక్కుదుము. మా వెంటనే చోరునకు కైలాసంబు కృపసేయుమనగా శూలుండు చోరరూపంబు మాని మహేశ రూపుండై నిజరూపంబుఁ జూపించెను. గుండ బ్రహ్మయ్య గారు కైలాస నివాసు లయిరి.

— * గణపతి రాజు కృత్యములు. * —

తదుపరి గణపతి రాజేక శిలా నగరంబునకు నైరుతి భాగంబున యోజన త్రయ దూరంబున నొక్క మహా తటాకంబు గట్టించెను. దానికీశాన్య భాగంబున గణపురం బను పురంబు గట్టించెను. అక్కడ శివాలయములు గట్టించి ప్రతిష్ఠలు చేసెను. అంత రాజ్యంబు పాలించుచు నేక శిలానగరంబు నకు పశ్చిమ భాగంబున యోజన పంచకంబగు దూరంబున పురంబు గట్టించెను. మూరు రాయ గండ పెండా రంబులు వామ పాదంబున ధరియించెను. అనంతరము కటక వల్లభునిచే నప్పనంబులుగొని తెప్పించెను గోదావరి గర్భంబునఁ గొన్ని క్రతువులుగావించెను.

* సిద్ధుఁడుగణపతి రాజునకు పాషాణమునకు జలధారనుజూపించుట *

తానురాజ్యం బేలు సమయంబున నొక్కనాఁడొక సిద్ధుండు చనుదెంచి గణపతిరాజు సమ్ముఖంబున నిలిచి యిట్లనియె. నేను యోగసిద్ధిగారకై భూ నభో భాగంబుల సంచరించి వచ్చుటం జేసి మహా దాహంబు జనియించెను. ఇందుకు శతఘటంబుల క్షీరంబులు సంపూర్ణ సిద్ధికి బో

యుంచిన గాని దాహంబు మానదని సిద్ధుండు పలికిన నాక్రమంబున దశ సేవకులతో చెప్పించి శతఘటంబులు పూర్ణములుగా క్షీరంబుల నెనికి పోయించెను.

ఒక్కయామంబు సన్నియు ద్రాగినం జూచి గణపతి మహారాజాశ్చర్యచిత్తుండాయెను. అంతనా సిద్ధుండు గణపతిదేవుని తనతో కొండకు దీసికొని పోయి యాకొండ మీదనున్న దక్షిణ గుహ వాకిట పాషాణంబు చెరనరికించి యందు సిద్ధుండొక్క ధారను గణపతి రాజునకు జూపి యీ జలంబులు కేదార తీర్థంబులు. హేమోదకంబులు గాని సహజ జలంబులు కావని విన్నవించెను.

హేమ సంకాశంబైన జలంబులు చూచి రాజాశ్చర్య చిత్తుండయ్యె. అక్కడ కేదార లింగంబు హనుమద్గిరి నాథుండను విష్ణు విగ్రహంబు ప్రతిష్ఠ జేసి యేకశిలానగరంబునకు దిరిగివచ్చెను.

—* గణపతిరాజునకు ముమ్మమ్మయను కుమార్తె జనించుట *—

గణపతి మహారాజు తనకు సంతానంబు లేకునికి పద్మాక్షీ వర ప్రసాదంబున నొక కన్యకా రత్నంబును గాంచి ముమ్మమ్మయను నామకరణంబు జేసెను.

ఆకోమలి నవయౌవనవతి యైన జూచి చోళాఖ్య తిలకుండగు వీరయ్య దేవుండను రాజసుతునకు వివాహంబు జేసి యెనిమిది కోట్ల సువర్ణంబులు నిక్షేపంబు జేసెను. తనపురంబు నంగల యగ్రగణ్యులను జూచి మీకు నాయకత్వం బిచ్చెద మనిన మాకు క్షాత్ర ధర్మంబులొప్పవని వారు పల్కిరి. అంత నానా వర్ణంబుల వారికి నాయకత్వంబు కృపజేసెను. నానామండలీశ్వరగండ బిరుదు జెల్లించుకొని గణపతిదేవుండరువై యెనిమిదియేండ్లు రాజ్యంబు పాలించి శివలోకంబునకరిగెను.

రుద్రమహాదేవి రాజ్యంబు పాలించుట.
ఈమె గణపతి రాజు యొక్క భార్య.
శాలివాహన శక ౧౧౮౭ నుంచి ౧౨౦౮ వరకు

రుద్రమహాదేవి పీరపత్ని గావున పద్మాక్షీ దేవి దత్తంబైన ఖ
డ్గఖేట కంబులు సింహాసనంబును [illegible] దేవయ్య గారియను మతంబున
రాజ్యంబు పాలింపుచుండెను. [illegible] జేయుగ మిగిలిన కలుకోట
మహోన్నతంబుగా గట్టించెను. [illegible] భూమి ప్రజలకు నుండు టకు భూ
మికోటలు వేయించెను [illegible] బుగా పుట్టకోట వేయించెను.
కలుకోటకు నాలుగు గవినులును నాలుగు దిడ్డులు నేర్పరిచెను. భూ
మికోట కెనిమిది గవునులును, పదహారు దిడ్లు నేర్పరిచెను. అనేకశివాల
యంబులు గట్టించెను. పురబాహ్య [illegible] సర్వ వృక్షంబులు వే
యించెను. అయిదు వేల విప్రులకు వివాహంబులు చేయించెను. చెరువు
లు త్రవ్వించెను. స్థలంబుల నేమములపెట్టించెను. నాలుగుకోట్ల నిక్షేపం
బులచేసెను. కటక పల్లభుపై దళంబుల [illegible] వానిచేనప్పనంబులు గొని
తెప్పించి వానిని తన యాజ్ఞకులో జేసికొని మహావైభవమున దనరు
చుండెను. తనకూతురైన ముమ్మమ్మ మహాదేవికి మంచి సుతుండు కావ
లెనని నోము నోమించెను. తమ తమయింటి వేలుపైన కాకితమ్మకు జా
తర చేయించెను. ఒర్డేపల్లి వినాయకునికిన్ని మొగిలి చర్లయేక వీరాదే
వికిని అయినవోలు మైలారపు దేవికిని సకల దేవతలకును మహోత్స
వంబు చేయుచు నయిదుదినంబులు పురంబు వెలుపల యుండెను.

అంత సవతి సుతులైన హరిహర దేవుండును మురారి దేవుండు
ను బలిజనంబుల గొందఱిని కూర్చుకొని పట్టణంబు గవాటంబులు మూ
యించెను గోసియ కమరల బిడ్డ హరలను సామోపాయంబున మట్టుపరచి
రుద్రమాంబ పురంబు ప్రవేశించి వారలబంధించి పుత్ర మిత్ర కళత్ర సహి
తంబుగా దునిమించెను. హనుమకొండ సిద్ధేశ్వరుని సహస్ర కమలంబుల
బూజించెను. పద్మాక్షీ దేవికి సత్య మహోత్సవంబు గావించు
చుండెను.

అంత దేవగిరి రాజు సమస్త సేనా సమేతుండై యేకశిలా న
గరంబు పైవిడిసిన వారలతో నెదిరించి యొక పక్షంబు ఘోరయుద్ధం

బుఁ జేసి మూఁడు లక్షల పదాతుల నుగ్గుఁ జేసిలక్ష గుఱ్ఱంబుల నేలగూ
ల జేసెను. పాఱిన వారల వెన్నుతగిలి దేవగిరి జొచ్చుపర్యంతముదరిమి
వాఱి నుంచి కోటి ద్రవ్యములు కానుకబట్టె. మఱియు నాద్రవ్యంబుత
న సరదార్లకు పంచి పెట్టించెను. అచ్చట జయస్తంభములు వేయించి
వారల తనయాజ్ఞను లోను జేసెను. మరియు నేక శిలా నగ రంబు ప్ర
వేశించెను

అంత సమస్త బంధు సామంత బలంబుల కుమారులకు
రుద్రమహారాజు పేరుపెట్టించెను. సకల జనంబులు "అంబా" యని ప
లుకుటం జేసి తనపేర అంబాలయమను గ్రామంబుఁ గట్టించెను. నిజనా
మంబున వేయి రుద్రవరములగట్టించెను. అష్టదిక్కుల జయస్తంభంబుల
నెత్తించి మహా వైభవంబుతో రాజ్యంబేలు చుండెను.

—* ముమ్మమ్మ గర్భముదాల్చి ప్రతాపరుద్రుని కనుట *—

అట్టిసమయంబున ముమ్మమ్మ దేవి గర్భముదాల్చెను నవమాస
ములునిండగా శివదేవయ్యగారిని రావించిపూజించిఈసుభ వార్త నెరింగిం
చెను. అంత నాతనుఁ డిట్లనియె ఈముమ్మమ్మ గర్భంబున నుదయించిన బా
లుండు సర్వలక్షణసంపన్నుండును విక్రమార్జనుడు దానకర్ణుండు,అఖిలకీర్తి
ణీతలాధ్యక్షుండు నగును. ఇదిగాక బాల్యంబున రుద్ర సహ్న భు
డుగాని మర్త్యమాత్రుండుగాడు పదినెలలకు బుట్టినప్పుడే యబ్బాలుం
డుసింహాసనం బెక్క గలండు. ఈవచనంబు సత్యంబని నవిని యుల్లంబుల
హర్షంబుతో శివదేవయ్య వచనంబులఁ దనసామంత వర్గంబున కెరిం
గించెను. అంత పురంబునంగల దేవాలయంబులు శృంగారంబులు చేసి
యద్దేవతల మహావైభవంబుల బూజించెను. నృత్య గీతాదులను బంచ
మహావాద్యంబులు ఘోరున మ్రోయంగఁ జేసి పురంబెల్ల శృంగారించె
ను. భూసురుల బిలిపించి యాహైలక్షలవరహాలుపంచి పెట్టించెను.
సామంత వర్గంబునకు చీనచీనాంబరములు మణిమయాభరణంబులొ
సంగి మీకు రాజుగలుగుచున్నాడని యెరుంగ బలికి కొలువైచెను.

ఆదేవికిఁ గ్రమంబున గర్భాదానాది కంబులు చేయఁ జూడ దశె మ మాసంబున శాలివాహన సత్సరంబులు వేయిని. పదమూడు ఁబడ నరుచున్న ఆనందనామసంవత్సరచైత్రశుద్ధగి గురు వారమందు రోహిణీ నక్షత్రంబున బ్రాహ్మీ మూహూర్తంబున సూర్యాంగారకబృహస్పతులుచ్చ స్థానంబున, శనైశ్చరుఁడు స్వక్షేత్ర స్థానంబున నమ్మమ్మ దేవికి సుతుఁడు దయించెను.

—* రుద్రమహాదేవి పుత్రోత్సవంబు చేయుట. *—

అంత రుద్రమహా దేవియే తెంచి యబ్బాలుని శుద్ధోదకంబుల శరీరంబు గడిగి కొలువు కూటంబునకు వచ్చి సింహాసనంబు పై బొత్తిల పరచి యబ్బాలుని నునిచెను. అనంతర మేకశిలా నగరమందలి ప్రజల బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రాదులను నామ తులను మన్నీల దొరల భూవర్గంబును నాదిగాగల డెబ్బది నియోగంబుల వారినిరావించెను ఆ బాలుని వారికిజూపి మీకు రాజుగలిగెను. ఇదిగో యనిన సకల జనంబులును మహానందంబున నోలలాడిరి. ఆబాలుని వారు దీవించి వెళ్లిరి.

రుద్రదేవి శివదేవయ్య గారిచే నా బాలునికి విభూతి ధరియింపజేసెను.మరియు పుత్రోత్సవంబున [illegible] లకు నయిదుకోట్ల వరహాలు పంచి పెట్టించి చీని చీనాంబరంబుల నొసంగెను. విప్రులకు లక్ష ధేనువు లొసంగెను పురంబలంకరించి సమస్తదేవతా వైభవంబులు సాగించి పుత్రోత్సవంబు గావించెను. ఆరుద్ర మహాదేవి సకలజనంబుల సంతోషంబు గాంచి యబ్బాలునకు నొక దివ్యమందిరంబున నవరత్న ఖచితంబైన నొక తొట్టె గట్టి యాతొట్టెలో నాబాలు నునిచి మాంత్రికుల నాపులను బిడ్డలగన్న వృద్ధాంగనలను నిత్యంబునుం బాలునిం జూచుటకు నియమించెను.

—* నామకరణంబు చేయుట. *—

విధ్యుక్తంబుగా పుణ్యాహవాచనంబులు చేయించి యపారద్రవ్యంబు భూసురుల కొసంగి శివదేవయ్య గారినిం జూచి యాబాలునకు

నామకరణంబు చేయుమన నాయయ్య రుద్రమదేవికిట్లనియె. ఆబా
లుండునకుపేరు మోసుకొని నీ కట్లు ధరాచక్రంబును మహామహిమతోఁ బా
లించునని ప్రతాపరుద్రదేవుఁడని నామకరణంబు చేసెను.

ఆబాలుండంత దినదిన ప్రవర్ధమానుండై శుక్లపక్ష సుధాక
రుండువోలె పెరుగుచుండెను. అట్టియెడ ప్రతాప రుద్రునకుఁ బీడాపరిహా
రార్థంబుగా నిత్యంబును మూఁడువేల వరహాలు పంచి పెట్టుచుండెను.
అబ్బాలునకు నయిదు వర్షంబులు రాగనే రుద్రమహాదేవి తన యంక
పీఠమునఁ గూర్చుండఁ జేసి యాడించుచుండెను. అంతనా ప్రతాపరు
ద్రుండు తన్నాశ్రయించిన జనంబులకు యుక్తాయుక్తంబులు దలంచక
యేమియడిగిన నదియొసంగుచుండెను రుద్రమాంబయు నాతని వచ
నమును జెల్లించుచుండెను. అతండట్లు నెరుంగ నతనటుకుఁ బంచి పె
ట్టిన గ్రామంబులు పదునైదునూరులు మూఁడుకోట్ల సువర్ణంబులాయెను.
అటుతరువాత ముమ్మనమ్మ మహాదేవికి మఱియొక సుతుండుద్భవించెను
అన్నమదేవుఁడను నామకరణంబు చేసెను.

—* ప్రతాప రుద్రునివిద్యాభ్యాసము *—

అంత ప్రతాప రుద్రునకు గర్భాష్టకంబున నుపనయనంబు గా
వించె, యక్షరాభ్యాసంబును వేదాధ్యయనంబును జెప్పించెను పది
యవ వర్షంబున నిజదక్రమంబును బదకొండవ యేటను ధనురాది సా
ధనంబు, చిత్రకర్మలు, చేయించెను. పండ్రెండవ యేట కావ్య నాట
కాలంకార శబ్ద శాస్త్రంబె తెలిపించెను, పదమూడవ యేట గజ తుర
గారోహణంబులు నేర్పించెను. పదునాల్గవ యేట సమస్తదేశ భా
షసంజ్ఞ లెరుంగ జేసెనుపది యేనవ యేటను రాజనీతి ప్రకారంబు ధ
ర్మాధర్మంబును బోధింప జేసెను. పదియారవ యేటను విశాలాక్షి
మొదలైన రాజకన్యకలను బదియార్వురిని పెండ్లి జేసెను. తదనంతరంబున
శ్రీమత్ప్రతాప రుద్రుని సింహాసనంబున నాసీనుం జేయవలయునని త

లంది రుద్రమహాదేవి శివదేవయ్యా గారిని రావించెను. తరువాతనా తని పాదంబు లకు నృపాలునిచే మ్రొక్కించి యతనిచేత విభూతి ధరి యింపం జేసి, పట్టాభిషిక్తుం జేసి, శ్రీమత్ప్రతాపరుద్రుని నాయయ్యా కు నొప్పన జేసెను. ఆరుద్ర మహాదేవి ముప్పది యెనిమి దేండ్లు రాజ్యంబు పాలించి దాను శివలోకంబున కరిగెను.

{ ప్రతాపరుద్రమహారాజుసింహాసనంబెక్కుట
శాలివాహన శకముగాఁగ నంచి ౧౨౨౮వరకు }

ప్రతాప రుద్రమహారాజు పట్టాభిషిక్తుండైయున్న నెడకాళేశ్వర నివాసులైన రామారణ్య శ్రీపాదులునుమహేంద్ర శ్రీపాదులును మొదలైన మును లేతెంచిరి. అంతవారికి సాష్టాంగ దండప్రణామంబులు చేసివారల పూజించి వారలచే దీవనలు గైకొని వారల యభీష్టంబే మనియడిగెను. వారుతమకు పరుశవేది లింగంబు సేవించుట మాకభీష్టంబని వచించిరి. అట్లకాకయని యామునులం దోడ్కొని శంభులింగంబు నగరికింజని యాదేవునిం జూపిన వారలాలింగమును సేవించి చనిరి. తద నంతరంబున గొందఱు దుష్ట నాయకులు గూడి స్పర్శ లింగంబును గొని పోవనుద్యోగించి బహుజనంబుల గూర్చుకొని యాదేవుని కావలి వారల గొట్టినగరు జొచ్చిరి.

ఆసమయంబున శ్రీమత్ప్రతాప రుద్రుండు వినిదేవ దత్తంబైన ఖడ్గఖేట కంబుల నిరుగేలంబూని తనసమీపంబున నున్న యాప్తవర్గంబుల తోఁగూడి యామంట పంబున నున్న దుష్ట నాయకుల దునిమెను. మరియు నొక్కనాడా పురిదుష్ట నాయకులుగూడి, యాకులచంద్రయ్యయను విప్రునియిల్లుసొచ్చిసర్వధనంబులపహరించి విప్రునింబాడదిపోయిరి

అతండు మూర్ఛాగతుండయ్యెను. భూపాలుండా వార్తవినియా విప్రుండుచచ్చినందనకు బ్రహ్మహత్య తగులునేమో యని మహాభయంబుది చింతించు చుండెను. అట్టి సమయముననావిప్రుని పత్ని పతివ్రత గావున లక్ష్మీదేవి వరప్రసాదంబునం జేసి తనపెనిమిటికి ప్రాణహానిగాకుండ బ్రతికించు కొనెను.

ఆవార్త భూపాలుండు విని యావిప్రదంపతులనుగావించి పూజించి చీని చీనాబరంబు లిచ్చియొక్క గ్రామం బొసంగి పంపెను. వారలా గ్రామంబున లక్ష్మీదేవి ప్రతిష్ఠించి యాపురంబును లక్ష్మీదేవి పురంబని పేరుపెట్టుకొనిరి.

* ప్రతాప రుద్రుని రాజ్య పరిపాలనము. *

తదనంతరంబున నారాజు సంతోష చిత్తుండై కొలువుకూటంబున సింహాసనాసీనుండై తనబాంధవులరప్పించి సోమదేవ రాజు నాటనుండి వంశపరంపరగ గొలుచుచున్న సరదార్లను మన్నీల ప్రెగ్గడలను, మఱియును పురిగలదొరలను తదనంతరంబున వేద వేదాంగ పారగు లగు విప్రులను బుధజనంబులను, వివేక చతురులగు వారు మొదలుగా గలుగు సకల నియోగంబుల వారిని రావించి, విహితాసనంబుల గూర్చుండని యోగించి, గంధకస్తూరి కర్పూర మిళితంబు లైనగంధంబులను దాంబూలంబుల నొసంగి శ్రీమత్ప్రతాప రుద్రుండు వారలతో నిట్లనియె. వింటిరే యున్నటి రేయివింత దేవునిపై బాదపోట్లు పడెరి. ఈరేయి విప్రునిపైబడెరి. రాజ్యంబ నాయకంబై యున్నది. ఇందులకు గార్యంబెటింగించు మనెను.

అంతవార లందఱు నేకక్రమముగా నిలిచి యిట్లనిరి. నీవుసాక్షాద్రుద్రుండవు గానిమనుజ మాత్రుండవు గావు మీరలే రీతిం జేసిన నది యే మాకుసమ్మతంబనిరి.

ఆరాజువిచారించి గణపతి మహారాజు నానా వర్ణంబుల వారికి నాయకత్వంబు లిచ్చుటం జేసి బహునాయకత్వంబై యున్నది గనుక నొక్క యుపాయం బిందులకు నుత్తమంబు నుత్తమ జాతులవారు దప్ప నాయకత్వంబునకు నితరుల ర్హులు గారని రాజుయిట్లనియె. మానధనులును విశ్వాసపరులును నతివివేక సంపన్నులును గాంభీర్య సముద్రులును వివేకపరులును బాపభీతులును స్వామి హితోపచారులును నగు సచ్ఛూద్రులు పద్మనాయకులు వీరలు నాయకత్వంబునకుం దగుదు

రని సభాసదులకు శ్రీమత్ప్రతాపరుద్రుండు మొఱంగం బలికినవిని యా సభాసదులు రాజనీతి వివేకమునకు నెంతయుం గొనియాడి మాకు సమ్మతంబట్లనే చేయుమనిరి.

ఆ ప్రతాప రుద్రుండు పద్మనాయకులఁ బిలిపించి సన్మానించి ముందుల నాయకత్వంబున కర్తలుగా నేర్పరచి యొక్కొక్క కొత్తడంబున కొక్కరిని సర్వలక్షణ సంపన్నులగా నొనర్చి వారలకు ధనకనక వాహనాందోళి కాదులును నుపాది చీనిచీనాంబరంబుల నొసంగెను. మఱియు ఛత్రిచామరంబులు నాలపట్టంబులును సాహస కృత్యంబులు బిరుదులు నొసంగెను డెబ్బదేడు గోత్రంబులకు డెబ్బదేడ్వురి నిట్లు బహుమానంబు జేసి యేకశిలానగరంబునకు శిలాప్రాకారంబున డెబ్బదియేడు కొత్తడంబు లుండఁజేసి వారి బంధువుల నుపనాయకులఁజేసి కొత్తడంబుల నుండు నట్లుగాఁజేసి మఱియు డెబ్బదియేడ్వురు నాయకులకుఁ దనరాజ్యంబులో నొక్క భాగంబుఁ బంచిపెట్టెను. మఱియు నొక్క భాగంబు బంధువులకును నొక్క భాగంబుఁ దనమూల బలంబుల కొసంగెను. ఒక్క భాగంబు విప్రుల కొసంగెను. సవిశేషంబైన రాజ్యంబు తన భండారంబునకుఁ జెల్లంజేసి మహామహిమతో రాజ్యంబు పాలింపుచుండెను. సప్త సంతానంబులు ధరించెను. హేమాద్రి కల్పోక్త ప్రకారంబున సకల దానంబులు చేసి ప్రతివర్షంబును బన్నెండు తులాభారంబులు దూగి కోటిసువర్ణంబులు దానంబులుఁ జేసెను.

* ప్రతాప రుద్రుఁడు దిగ్విజయంబు చేయుట. *

అనంతరము దిగ్విజయంబుఁ జేయుటకై సకలసేనల రావించి ప్రయాణ భేరివేయించి కటకవల్లభుని దగిలి వానిని సాధించెను. వాని సుతునికిఁ బట్టంబుఁగట్టి యెప్పటి యట్లు మూడుకోట్ల సువర్ణ నిష్కంబు లప్పనంబులు గొనెను. మఱియు వానిని సేనాయుక్తంబుగాఁ దనవెంట రావించి యచ్చట పాండ్య దేశాధీశ్వరుల సాధించి వానిసుతునికిఁ బట్టంబుగట్టెను. వానినిఁ దనవెంట రానియమించి యెప్పటి యట్లు నప్పనంబుగొని దక్షిణాభిముఖులై సముద్రతీరంబున కుంజనెను.

గోదావరి యుత్తరించి రామేశ్వర పర్యంతరంబుగా గల పురంబులు దనవశంబుఁ జేసికొనెను. ౨౦౦౦ ఓడలు గావించెను. అందుకుఁ దగిన వర్తకులను నియమించి నానా దేశంబులకు వర్తకంబు సేయం బంచెను. ఆచ్చట పెక్కు దానంబులు చేసెను. నాల్గు తులాభారంబులుఁ దూగి. తామ్రపర్ణీతీరంబున యున్న సమయంబున నరసింహ్మ రాయలు విజయనగరంబున నుండి దన మేనల్లుఁడగు నరసింహ్మ దేవునిచేఁ బాఁదొంబదు లక్షల పదాతి వర్గంబులతోఁ బ్రతాపరుద్రునిఁ గొలువం జేసి తాను విజయనగరంబునకు మరలెను.

తరువాత ప్రతాపరుద్రుండాడు మళయాళ రాజ్యంబేలు నూకుంబాదేవి నోడించి ౧౮ వేల సువర్ణ టంకంబు లప్పనంబులు గైకొనెను. ఆమె సేనలఁ వెంట రానియమించి కొంకణ మాళవ మళయాళ బాహ్లీక దేశంబుల గెలిచి పదిపదేసిలక్ష లప్పనంబులు గైకొనెను. వారినిఁ గొలిచి రానియమించి పశ్చిమ దేశాధీశ్వరుల గెలిచి వారిఁ దన యాజ్ఞకులోఁ జేసికొని యేబదిలక్షల సువర్ణ సమ్మానంబులు పుచ్చుకొనెను వారిని మూడులక్షల గుఱ్ఱంబులతోడను గొలువ నియమించి గుజరాష్ట్ర మహారాష్ట్ర దేశాధీశ్వరుల నోడించి వారిచే నప్పనంబులుఁ గొనెను. మఱియుఁ దక్కిన రాజులం గెలుచుచు వారినిఁ దనయాజ్ఞకులోఁ జేసికొని యప్పనంబులు గొని వారిని సేనాయుక్తంబుగాఁ దన వెంట రానియమించెను.

అంతటఁ బూర్వదక్షిణ పశ్చిమ భూములనుఁ దన యాజ్ఞకులోఁ బరచుకొని యతండు డిల్లీశ్వరుండు తనకు నెయ్యముగాఁ బంపిన కానుకలు గైకొనెను. భాగీరథిం జేరి గంగాయమున సరస్వతీకృత స్నానుండై పెక్కు దానంబులు జేసెను. ఎనిమిది తులా భారంబులు దూగెను. ప్రయాగభేరి వేయించి యాపట్టణంబు తన వశంబుగాఁ జేసికొనెను. ఆపురంబునఁ గలమాధవదేవునిఁ బూజించి యద్దేవుని వైభవంబునకు నాపురం బిచ్చెను.

ఉ. కాశికి నేగి వేగమణి । కర్ణికలోన మునింగి భక్తివి
శ్వేశు భజించి యవ్విభున । కిమ్ముగ నప్పురమిచ్చి యచ్చట

స్వైరలబుద్ధి భూమిసుర బృందములం బిలిపించి వారికిం
గౌశలమొప్పఁ గోటినవ కాంచన నిష్కములిచ్చి వేడ్కయున్.

సోమదేవ రాజీయం.

అటనుంచి కాశికిం జని మణికర్ణికయందు మునింగి విశ్వనాథుని సేవించి యానగరంబు విశ్వనాథున కొసంగెను. అచ్చట నిరువది తులాభారంబులుఁ దూగి కోటిసువర్ణంబులు దానంబు జేసెను. అట్టి తఱిని జ భుజా యేలితంబైన దుర్గంబుల కొల దెఱిగించెదను. అటతాళీ సహస్ర చక్రకోటాధీశ్వర బిరుదును. ధరాధర బిరుదును సిద్ధసింహాసనాధీశ్వర మున్నగు బిరుదులను సాధించెను. మఱియు గయకుం జని యాసుల్తానుచేఁ బూజితుండై యచట సర్వ్మజనంబులచేత మాతామహులకును పితామహులకును పిహిత కృత్యంబులు జేయించెను.

మఱుఁడి వింధ్యనగరంబుఁ దాటి గోదావరీ పాతకూటంబుల బసేవించి విధ్యుక్త ప్రకారంబు నచటను బదిరెండు క్రతువులు చేయించెను కాళేశ్వరంబునకేతెంచి ముక్తీశ్వరుని దర్శించెను. పన్రెండుతులాభారంబులు దూగెను. కోటిసువర్ణంబులు దానంబు జేసెను. రెండువేల విప్రులకు వివాహంబులుఁ జేసి సాల దానంబులు గావించెను. వేయి శివాలయంబులు, మున్నూరు విష్ణు స్థానంబులు ప్రతిష్టలు జేసెను. ఏకశిలానగరంబున కీశాన్య భాగంబున నొక్క ప్రతాపగిరియను దుర్గంబు గట్టించెను

అంతమాద్గల్య మనుక్షేత్రమునకు వచ్చియాగుండంబున స్నానంబుఁ జేసి రామేశ్వరుని నారాధించెను అచ్చటనున్న తంబుగా గుడియొకటికట్టించి నచటి మునులిది మాండకర్ణ ఏకాంతస్థల మగుటయిచ్చట జనసమ్మర్ధము గూడదనిరి. అంతనాతఁడా ద్రవ్యంబు దెప్పించి పాకాల చెఱువు కట్టించెను ఒక్కపురంబుఁ గట్టించి కోటఁ బెట్టించెను పాకాలసీమలో నలువది గ్రామంబులు రామేశ్వరుని వైభవంబున కొసంగెను ఎనమిది తులా భారంబులు దూగెను షోడశ మహాదానంబులు చేసెను తిరువాతనేక శిలానగరంబునకు వచ్చుచుండెను

ఏకశిలా నగరంబున కీశాన్య భాగంబున నొక్క ప్రతాపగిరియను దుర్గంబుగట్టించెను.

అంత సూర్గల్యమను క్షేత్రమునకు నచ్చి యగ్గుండంబున స్నానంబు జేసి రామేశ్వరుని నారాధించెను. అచ్చట నున్న తటాకంబుగా గుడి యొకటికట్టించెదననచటిమునులిదిమాండకర్ని యేకాంతస్థలమగుటచేతః జనసమ్మర్దనము గూడదనిరి. అంతనాతఁడా ద్రవ్యంబు దెప్పించి పాకాలచెరువు గట్టించెను. ఒక్కపురంబుఁ గట్టించి కోటఁ బెట్టించెను. పాకాల సీమలోనలు వది గ్రామంబులు రామేశ్వరుని వైభవంబున కొసంగెను. ఎనమిది తులా భారంబులు దూగెను. షోడశ మహా దానంబులు చేసెను. తిరుపతి నేకశిలా నగరంబునకు వచ్చుచుండెను.

అట్టి సమయంబున దనతమ్ముఁడైన యన్నమ దేవుండు రాజ్యంబు పండ్రెండు వర్షంబులు పాలించి ప్రతాపరుద్రనరేంద్రునకు యోజన దూరంబున నెదుర్కొని దండ ప్రణామంబులు చేసి ముకుళిత హస్తుండై మ్రోలనిలిచెను. అంతఁదమ్మునిజూచి ప్రతాపరుద్రుండు కౌగలించుకొని కుశలం బడిగెను. పరిజనంబుల గారవించెను. సంతోష చిత్తుండై పురంబుఁ బ్రవేశించి శంభులింగంబు నారాధించెను

తదనంతరంబున సింహాసనాసీనుండై కూర్చుండి తన వెంట వచ్చిన నానాదేశాధీశ్వరుల నిజనివాసంబులకుం బంచెను. అంతః పురంబునకుం జని తన తల్లియైన ముమ్మడమ్మ మహాదేవికి సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించెను. ఆయమ్మ చేతదీవెనలు గైకొనెను. భోజనశాలకేగి మజ్జన భోజనాదులు దీర్చుకొని సుఖసుప్తుండై యుండెను.

అనంతరము విశాలాక్షి యందు విరూపాక్షుండను వీరభద్రుండను సద్ద్విసుతులను గాంచెను. మహామహిమతో రాజ్యంబు పాలింపుచుండనేక శిలానగరంబు నమరాపురి సమానంబై ప్రకాశింపఁదొడంగెను

ఆ నగరంబు నంగల నానావర్ణంబుల సంఖ్య యెట్టిదనిన,

—* నానావర్ణంబుల సంఖ్య. * —

వేదవేదాంగ పారంగతులైన విప్రగృహంబులు ... ౧౮౦౦౦

| | | |
|---|---|---|
| రాజగృహ రాజ్యకార్యములు దీర్చుమంత్రుల ఇండ్లు | ... | ౨౦౦౦ |
| రణరంగ చతురులైన క్షత్రియ నికేతనంబులు | ... | ౨౦౦౧ |
| సకల సామాగ్రిచే నొప్పువైశ్య గృహంబులు | ... | ౩౦౦౦౦ |
| ఇందులోఁ బ్రసిద్ధికెక్కి కోటికిఁబడగెత్తినవైశ్యులఇండ్లు | ... | ౪౨౦ |
| నాలుగవ జాతివైన విలసిల్లు పద్మనాయకులు | ... | ౭౭ |
| మఱియునష్టాదశ వర్ణంబుల గృహంబులు | ... | ౧౫౦౦౦౦ |
| విశ్వకర్మ వంశజులఁ ఇండ్లు | ... | ౨౦౦౦౦ |
| అనపగతంబుసంపూర్ణంబైనసంపదలచేనలరారుగొల్లఇండ్లు | ... | ౮౦౦౦ |
| కాపుల ఇండ్లు | ... | ౧౬౦౦౦ |
| ఈడుగుల ఇండ్లు | ... | ౩౦౦౦ |
| రుద్రజియ్యమొదలైన శివబ్రాహ్మణుల ఇండ్లు | ... | ౧౫,౦౦౦ |
| కుమ్మర ఇండ్లు | ... | ౪౫౦౦ |
| పట్టునేసె సాలె ఇండ్లు | ... | ౨౫౦౦ |
| పద్మసాలె వాండ్ల ఇండ్లు | ... | ౯౫౦౦ |
| మేదరి ఇండ్లు | ... | ౨౦౦౦ |
| చిత్తరు వ్రాసే ఇండ్లు | ... | ౧౫౦౦ |
| ఉప్పర ఇండ్లు | ... | ౧౫౨౦౦ |
| మేరవాండ్ల ఇండ్లు | ... | ౧౫౦౦౦ |
| బెస్త వాండ్ల ఇండ్లు | ... | ౧౬,౦౦౦ |
| తెనుగు ఇండ్లు | ... | ౬౫౦౦ |
| బుక్క ఇండ్లు | ... | ౬౩౦౦ |
| సాగరఇండ్లు | ... | ౧౩౦౦౦ |
| రజకుల ఇండ్లు | ... | ౫౦౦౦ |
| అగణ్యవస్తువాహన శోభితంబైనవేశ్యగృహంబులు | ... | ౧౨౭౦౦౦ |
| ప్రవాసులైన వారికివిడిది పెట్టెవంటలక్కల ఇండ్లు | ... | ౫౦౦ |
| బలిజభవనంబులు | ... | ౧౫౦౦౦ |
| మఱియునితర గృహంబులు | ... | ౭౭౧,౦౦౦ |

శివాలయంబులు ... ౫౫౦౦
విష్ణుస్థానంబులు ... ౧౩౦౦
మైలారు పూఁగ్గెస ... ౨౪౦౦
భైరవాది మార్గగణపతి వీరభద్రనివాసంబులు ... ౪౮౦౦
ఇందునుప్రసిద్ధ స్థానములు భేరీలు ... ౫౫౦
నిస్సానంబులు ... ౨౫౦౦
పంచమహాశంఖంబులు పట్నమంద హారాత్రంబులు
ప్రమోయుమందు గుళ్ళబూది పశిడి కుండలు ... ౧౫౫౨
దేవతాస్థానములదీపములకునూనెదినంబుకొలదికొలపాటు ...పుట్లు ౨౫

{ నగరి దీపాలకునిత్యబ్రాహ్మణుల సంతర్పణకున్ను
ఘనసార చందన పరిమళ ద్రవ్యగుంటకుచు } పుట్లు౫౦

{ ఆనగరిలో భాగీరథి జలంబులుగౌతమీజలంబులచేతను
శివుని పూజ చేయుయోజనవిస్తారంబయిన పురంబునకు }

నానావస్తు శోభితంబైన యంగళ్లు ౩౦౦
పిన్నయంగళ్లు ... ౬౦౦
పురంబునకు చుట్టున్న వీరభటవాసంబులు ... ౭౦౦
గూడెంబులు, ... ౨౫౦
చుట్టుపురంబు ఇంద్రపురి సమానంబై ఏకశిలా నగరంబున కధీశ్వరుం
డైన కాకతిరుద్రుపు గొలచియున్న నానాదేశాధీశులు అసంఖ్యాలు పద్మ
నాయకులు ౭౭
ఒక్కొక్క నాయకుని వీరభటులు ౧౫౦
ఉత్తమాశ్వాంబులు ... ౧౦౦
మదగజాంబులు ... ౯౦
కైదువంబులు గొని రాజమొగసాల గాచుభటధుర్యులు ౧౦౦౦౦
రాజనగరిలో హయంబులు ... ౨౪౦౦
సామజాంబులు ... ౨౫౦
ఉత్తరదేశాధీశ్వరుండగు కనోజురాజు వచ్చి కొలచి యున్న గున్న

ద్రంబులు ... ౧౦౦౦౦
వీరపాండ్యరాజును గెలచి తెచ్చిన ఏనుగులు. ... ౧౦౦౦
ఇట్టుల పార సం పద చేనుండి రెండవ దేవేంద్రుండై మూరు రాయర
గండ పెండేరంబులు వామపాదంబున ధరియించి యున్న శ్రీ ప్రతా
పరుద్రుని సత్యభోగంబు తెరం గెఱింగించెద.

బ్రాహ్మ ముహూర్తంబున మంగళ గతనాదంబులచేత మేలుగాం
చును. విహిత కార్యంబులఁ దీర్చుకొనును. పరిమళ తైల మంచే నభ్యం
గనంబు గావించుకొని కాశ్మీరఘన సారచంద నంబుల నలుగు బెట్టించు
కొని పన్నీట జలక మాడిదివ్యాంబరంబులు ధరించును. అనాదకిరీటం
బు ధరియించిమూరురాయర గండ పెండేరంబు ధరియించును. శాంభ
వీ దత్తంబైన ఖడ్గఖేట కంబు లిరుగేలం దాల్చును కనకపాదుకలఁ దొ
డుగును. వందిబృందము బాగడగా భూసురులా శీర్వాద మంగళ
గాయక గీతనాదంబులును భూరిభట వీర హుంకారంబులును నొ...
టియై వ్యాద యానందంబు వెలిగొన దర్ప ధానుఁడైన మల్లికార్జున క
రము బట్టివసంతస మేతుండైన మల యానలంబు తెరంగున మా...త్తి
క ఛత్ర చామరాది శోభితులై మణిమయస్తంభ విరాజితంబైన కొలు
వు కూటంబున కుంజను దెంచును సింహాసనా సీనుండై కూర్చుండును.

అట్టియెడ రాజ దర్శనంబునకు శాఖ వెల్లి మల్లికార్జున భట్లు
మొదలైన బ్రాహ్మణ విద్వాంసులు, బంగారు పల్లకీలెక్కి చనుదెంచు
వారునాటమేబంద్రుడును,సమస్త కళా ప్రవీణులైన పరిహాసకులు వర
ద రామనాథుండు లోకేసు బాచయ్య గారును రేంకర రాజు కేదా
ర రాజు మొదలైన సాహస విక్రమార్కులు యుత్తమ క్షత్రియులేనూ
రును దివ్య కాంతల బోలిన కాంతలునవరత్న ఖచితంబైన పల్లకీలెక్కి చ
నుదెంచు వారు శిరిగిరి మల్లికార్జునేశ్వర పురంగు జలవు హనేతి చి
త్తరు వాత్రిపతిమ పేరు మొదలుగా గల కొలువు స్త్రీలును ...
క నాడ బినుమపాత్రలు భరత కథల అంబాదేవి స్వరమండలి చక్రవర్తి
చిలుక పలుకుల త్రిపురాంబ మొదలైన బినుమపాత్రలు ౧౦౦౦ భాస్క

రుఁడు మొదలుగాఁగల కవీశ్వరులు ౨౦౦ గుండు భట్లు ప్రతాపభట్ల మొదలగు వేద వేదాంగ పారంగతులయిన పురోహితులు నూర్గురి యు నానా దుర్గాధ్యక్షులైన నానాదేశాధి పతులు పద్మనాయకులు మదగజంబులపై మౌక్తిక ఛత్ర చామరంబులు విలసిల్లుచుండ బిరుదు టెక్కెంబులును నాల పుట్టంబులును బర భూపతులను బైకంబగునట్లుగా సకల సేనా సమేతులైన వారు శ్రీరంగము దేవుండును రాయి రుద్రము దేవుండును పిడుదవోలి చెండా దేవుండును మొదలుగాఁగల డెబ్బదియేడుగురు పద్మనాయకులు వీరలకుఁ బెద్దయైన రుద్రప్పరాజు తమ్ముండు అన్నమ దేవుండు మొన్నగు వారు వచ్చియుందురు.

వీరలకు లెంక నాయకులం జెప్పెద విశ్వనాథుని రామలెంక జెట్టి నాగులెంక గోసులసుల్లు లెంక వాసిగల నాగు లెంక కోడూరు మల్లు లెంక వీరలు మొదలైన లెంక నాయకులు ౩౦౦౦౦౦ పదాతివర్గంబుల శోభితంబులు గాచుచుందురు. పెద్ద తలారి విశ్వనాథ పల్లభుండును మఱియు నానాదేశాధి పతులును రాయబారులును గజంబులకు దొరయైన మంకాళియును దొరయును నశ్వంబుల కధికారియైన సాహిణి మారయ్యయును సకల ధనుర్ధరులకుఁ బెద్దయైన కోలిపాక సిద్దయ్యయును మనుబోతుల కట్టియెక్కి వచ్చెవారు ౧౦౦ నానావిద్యల వారు కొలువు చేయంగ ప్రైకవిత్తంబుల బారవేయుచు పసిడి కుప్పెల జల్లులవారు ౫౦౦౦ లుంగొలువఁ బేరోలగంబున కూర్చుండును దేశాధి పతుల విన్నపంబు విలోకించును రాయబారుల మనవులాలకించును. రాజ్య పరిపాలనంబు సేయుచు శివదేవయ్యయు శరభాంకుడును, మల్లికార్జునుండును పాలకుర్తి సూరప్ప మొదలుగాఁగల ప్రధాని వర్గంబులతో ముచ్చట లాడుచున్న సమయంబున నీశ్వరస్థానంబులు ౫౧౦౦ విష్ణుస్థానంబులు ౩౦౧ దుర్గగణపతి క్షేత్రపాలకాది దేవతా స్థానంబులు ౪౩౦ నివియునుం గాక దేవతా స్థానంబుల కధికారులు పచ్చలపాలకీ లెక్కి చనుదెంచి దేవతా నైవేద్యంబు చెల్లెననువాక్యంబులు విని సింహాసనంబు డిగ్గియంతఃపురంబునకుం జనును.

## ప్రతాప రుద్ర చరిత్రము.

భోజనశాల కేతెంచి తన బంధువులును దానుదేశాధిపతులును తమ్ములైన యన్నమదేవుండును డెబ్బది నేడ్గురు పద్మనాయకులును నొక్క బంతిగా కూర్చుండి నానావిధ పదార్థంబులతో ౧౧౦౦ గూడా భోజనంబులు చేయును. తేటనీట నెంగిలవార్చియు పొంగుచు గద్వార విడియంబు సకల జనంబుల కొసంగును వారల నంపరి వనిపి యొక్కర హాస్య హర్మ్యంబున టూగుటుయ్యాలపై బవళించి సేవకా జనంబులు పాదంబు లొత్తుచుండ దాసదాసీ జనంబులు 3౨౦౦ గలిగి యున్న ప్రతాపరుద్రుండు కొంత తడవు విశ్రమించును.

అంతనమ్మహారాజు కొలువుకూటమున కేగి నెడ లులాయ వ్యాఘ్రను భల్లూక గజ యుద్ధంబులును మల్లుల పెనగు లాటలును సరస కావ్య నాటకాలంకారశబ్ద శాస్త్ర ప్రసంగంబులును, హాస్యవచోవిశారదులైన పరిహాసకుల వాక్యంబులు, పుణ్యకథా శ్రవణంబులు వారాంగనా నృత్యగీతవినోదంబులును మొదలుగాగల చిత్రవినోదంబుల గాలంబు గడుపుచు ప్రొద్దుబుచ్చుచుండును. సాయంకాల మగుటతోడనే నగరు వెడలివచ్చు సమయంబున ప్రతాప రుద్రుని సేవకులు కరదీపికలు 3౮౦౦ గ్రహించి నలుదిక్కుల గొల్వగా నిజపరివార సమేతుండై శంభుమహా త్రియగు జ్యోతిర్మయంబగు శంభులింగంబు నగరికేగి జనును శంభులీలా విలాసంబులు చనువుచు ప్రదక్షిణత్రయంబు గావించి సేవించుచు గొనియాడుచు నొక్క యామంబారాధించును. అచ్చటంబాసి నగరు కేతెంచి సకల జనంబులను విహితంబు గానను పును. పెద్దతలారి మైనవిశ్వాకవల్లభుండు పరివారంబులతో గొలువరెపు ఘడియలు కొలువు గావించును. అంతన తనని పీడ్కొలిపి యభ్యంతరవర్తి యైయుండును. ఇట్లాగి రాజ్యభోగంబులనుభవించుచు దేవబ్రాహ్మణపూజలను దటాక ధననిర్మాణంబు లనునగణ్య పుణ్యకృత్యంబుల సలుపుచు నుండును.

శ్రీమత్ప్రతాపరుద్రదేవునకు జెల్లి పభూముల మేర లేవియన, ఉత్తరదేశంబునకు భాగీరథిమేర పూర్వదక్షిణ పశ్చిమంబులకు సముద్రము మేరదన యాజ్ఞ చెల్లించుచు ఏకచ్ఛత్రమై రాజ్యంబు పాలించుచుండె

అందు నప్పనంబు లిచ్చు కటకవల్లభుండాది గాలోను జిల్లరాజులు ప్రతివర్షంబు లిచ్చు యప్పనంబులు ౨౮ కోట్లు. తననిజ భుజార్జితంబైన రాజ్యంబు వలనవచ్చు ధనంబులు ౨౦ కోట్లు అది గాక యగ్రహారంబులు బ్రాహ్మణులకు జెల్లుచుండు గణపతిరాజు మొదలుకొని యటునున్న యేలిన కాకతి రాజులిచ్చిన యగ్రహారంబులు ౨౦ వేలు విప్రులకు జెల్లుచుండు దేవతా వైభవంబులు ౨౦౦౦ గ్రామంబులు చెల్లుచుండు అదిగాక తన బండారంబునకు వచ్చురకర కోట్లు. ప్రతివర్షంబు నకు వ్రయంబు ద్రవ్యంబుతులా భారంబు నకు ౩ కోట్లు ౯౦ లక్షలు నిత్య వైభవంబులకు గంధ కస్తూరి కర్పూర కాశ్మీర జవ్వాజి పరిమళంబులకు బంతి భోజనంబులకు నగరి దీపాల తైలంబునకు ౩ కోట్లు ౬౦ లక్షలు పురంబు గాచు నిశ్శంక వల్లభుని జీతంబు ప్రతివర్షంబు నకుబలిసహితంబుగా ౮౪ లక్షలు ౨౦ వేలు అన్నసత్రంబుల లెక్క యొక్కొక్క సత్రంబునకు వెయ్యేసి విప్రులచొప్పున ౧౦౦ సత్రంబులు ఆలక్ష ద్విజులకు నేడాదికి నొక్కకోటి ముప్పది లక్షలు నగరి మొగసాల గొలుచు వారలకునవలక్ష ధనుర్ధులకు నేడాదికి ౩౮౦ లక్షలు రాజమునగజంబులకు నుత్తమాశ్వంబులకు జీతంబుల వారికి ౨౯౦ లక్షలు ఏకశిలానగరంబునంగల దేవతా వైభవంబులకునొక్కకోటి. నగరంబులో రాజగృహంబులు గట్టినవారికి ప్రతివర్షంబునకు నొక్కకోటి. వారణాసికివిసిద్ధేశ్వరునకు శ్రీశైల మల్లికార్జును నకు శ్రీవెంకటేశ్వరులకును శ్రీరంగనాయకు లకును నేకాంబ నాథేశ్వరు నకు రామేశ్వరు నకు మొదలుకొని దివ్యదేశని వాస మూర్తులకుఁ ప్రతివర్షంబునకు కోట్లు చెల్లించు చుండును. తమబండారమునకు కోట్లు చెల్లించుచుండును.

ఇట్లువిక్రమార్కతుల్యుని చందంబున మహామహిమతో రాజ్యంబు పాలించుచు సకల భోగంబులు పరివార సమేతంబు గానను భవించుచు రాజ్యంచేయు చుండెను. అట్టితరి దేశంబులు వివేకంబులు నత్యంతార్ధంబులై యానంద కరంబుగా శోభిల్లు చున్నవి. సకల జనంబులుగొనియాడుచుందురు ఈచరిత్రంబులు మానవులకుఁ గడుమర్మ భంబులు గావున

శ్రీమత్ ప్రతాపరుద్రుండు సాక్షాద్రుద్రుండు గాని మర్త్య మాత్రుడు గాడు. అతనిచరిత్రంబు లాదిపురాణాదులట్లు సకలానందం బైయుండును.

అనియిట్లు పలికి ప్రతాపరుద్రుం డొక్కపుణ్య గ్రహణ కాలంబున మహార్ఘ్యంబునకుం జనియగ్గుండంబున దీర్థంబులాడి యచ్చట రామేశ్వరుని సేవించి పెక్కు దానంబులు చేసెను. మఱియు ప్రతాపరుద్రుండు పదకొండు హిరణ్యధేనువులు చేయించి యొక్కొక్క ధేనువునకు ౧ లక్ష సువర్ణటంకంబులు దక్షిణ యొసంగి వేదవేదాంగ ప్రచండులైన విప్రోత్తములకు దానం బిచ్చెను.

ఆదానంబు లందనేరక విప్రోత్తములు చండాలవాటికకుం జని కొన్నికు యుక్తులు బలికిన నాచండాలురు రాజుచేత దమకు బ్రాహ్మణ మెఱుంగక యీసందంబుట్టు వడ బ్రాహ్మణుల సరికట్టుకొని యీసువర్ణ ధేనువులు సజీవంబులయ్యె నేనిమరల దొడ్కొని పొండు నిర్జీవ ధేనువులయ్యె నేనియది మాసొమ్ములని బ్రాహ్మణులతో వాదించ సాగిరి. ఆ బ్రాహ్మణులు ప్రతాపరుద్రుని కెఱింగించిరి.

ప్రతాపరుద్రుం డంత బహువిధంబుల రామేశ్వరుని నారాధించెను. రామేశ్వరుండు ప్రత్యక్షం బయ్యెను. ఆసమయంబున నాసువర్ణ ధేనువులు రాజు మొదలుకొని సకలజనంబులు చూచుచుండ నడువసాగినవి. అనంతరమున రాజు చండాలుల దండించి యేకశిలానగరంబు బ్రవేశించెను. ఒక్కనాడు ప్రతాపరుద్రుండు కొలువు చాలించి సకలజనంబుల వీడ్కొల్పి శివదేవయ్యగారు తాను నంతఃపురంబునకుం జనుదెంచిరి. రాజుపట్టపు దేవియగు విశాలాక్షి శివదేవయ్యగారిం జూచి పరపురుషుండు గదా యని మడుగునకు బోయెను. అంత ప్రతాపరుద్రుండు శివదేవయ్యగారిని నిజమందిరంబున కనిచి మజ్జన భోజనాదులు దీర్చి నవరత్న ఖచితంబైన యొక్క పీఠంబు నం గూర్చుండి తనపట్టపు దేవియైన విశాలాక్షి కిట్లనియె శివదేవయ్యను జూచి పరపురుషుండని తొలంగి పోయితివి. ఆయయ్య ఈశ్వరుండుగాని మనుష్య మాత్రుండుగాడు ఆయయ్యను బూజించి సుగతిగాంచు మని యెఱుంగం బలికెను.

ఆవాక్యంబులు విని విశాలాక్షీ దేవి తన చిత్తంబున బాదు కొల్పి శివదేవయ్యగారి యెదుట దానిల్లు నోడియును బలివాక్యంబులు మనంబున నిల్పి శివదేవయ్యగారి రూపంబుగా నొక్క సువర్ణ ప్రతిమను జేయుంచి, యొక్క సువర్ణ వేదికపై నునిచి షోడశోపచారంబులం బూజింపు చుండె.

అంతనొక్క నాడు మాస శివరాత్రియయ్యెను. ఆప్రతాప రుద్రుండు శివదేవయ్యను బిలపించి స్నానాది కృత్యంబులు దీర్చి శంభుని గెకిం జనెను. అర్ధ్యపురిం బూజించి యచ్చట జాగరణంబు సేయు చుండెను. అట్టి సమయంబున శివ దేవయ్యయు గిఱ్ఱున నిలిచిన, సుగంధము గాసువాసన దీకజూచి నంతనే జ్యోతి మంబు పంచాంగ భక్తులకురా సెర్చునే సజ్జోశిపఋ తెమదనివ్వతి ప్రాతప్రవేశంబున జిల్లెకు నొమ్మవిరచిన రక్తంబు గాంచెను. రాజదిగని సంతోషించి యొక్క బ్రిమ్మంబును పల్లకియు గృపజేసెను.

ఆవార్త భూసురు లెరింగి కటకటా! యితర జాతి ప్రజ్ఞలు నిందించి గ్రహాను గ్రహంబులైన విప్రజనంబుల మహాత్మ్యం బెరుంగ రాదయ్యెనని రాజసమ్ముఖంబున కేతెంచి యిట్లనిరి. జ్యోతిష్కులకు గాకయితర జాతులకు నెట్టులభించు పరీక్షం జూపినని జంబుగాదు. అమృతవేళ నెరింగి ధేనువుల యెదుట క్షీరంబులు పిదుకుడు. లేని జ్యోతిష్యం బెరుంగుట నిజంబగును. వేదవేదాంగంబు ద్విజాతులకుం గాక యితర జాతు లకు నెట్లులభించు పరీక్షజూపిన దన నిజంబుగాదు. అమృత వేళ నెరింగి ధేనువుల నెదుట క్షీరంబులు పిదుకుదు లేని జ్యోతిష్యంబు వారి సొమ్మని పచించి యొక్క గొడ్డుటావును జూపిరి.

అదిగని పరీక్షలిచ్చి వారుతొలంగి పోవుటం జూచి యమృత వేళ ఎరింగి పిదికిన, గుంచెడుపాలు పట్టుట యుం జూచి యాప్రతాప రుద్రుం డత్యంత విస్మయం బందెను. ఆవిప్రుండు గోనయట్లు గోదావరి తీరంబున శతవర్షంబను గ్రామంబ గ్రహారంబుగ నిచ్చెను.

మఱియు నొక్కనాడు దక్షిణదేశంబు నుండి సువర్ణన మిత్రుం

డు గజారూఢుండై నూర్గురు విద్వాంసులు గొలువనేక శిలానగరంబున కేతెంచి ప్రతాపరుద్రుని కొలువు కూటంబునంగల విద్వాంసులను వాదించి భిక్ష కేతెంచువాఁడ నని పలికెను. ఆవిద్వాంసులు వాదముఖంబున సుదర్శనమిత్రుని నవమాన పఱిచిరి.

అతండు గెలువనేరక, ఒక్కకాయు మాటలనైన గెల్చెదనని తలంచి యద్దినంబు కృష్ణచతుర్దశి యగుటం జేసి రేపమావాస్య నష్టచంద్రుండు ఇదినిజంబు. మీరెందరు కాదనియను దురాయని యెను.

అప్పుడేక శిలా నగర వాసులు విద్వాంసులును నవ్విపోయిరి ఆనిసహస్ర ధారల నుపమించు నేర్పుటం జేసి సుదర్శన మిత్రుండను పెరుపెట్టుకొని వేదశాస్త్ర ముఖంబుల నిల్వనేరక పోయి, నీయొమాటలకుం బొచ్చితివి ఆజ్ఞయునను నప్రతిష్ట ననియని యందరు. రేపు నష్ట చంద్రుండుగాదు. సంపూర్ణ చంద్రుండు ఇది నిజంబని విప్రులాదఁను సభ వెడలి పోయిరి.

ఆరాత్రి శాఖవల్లి మల్లికార్జున భట్టుహానును కొండకేగి యచ్చటస్నాన సంధ్యాది కృత్యంబులం దీర్చి భద్రకాళిగుడిం జొచ్చి యద్దేవి నారాధించిపదకొండు శ్లోకంబుల స్తుతించెను. ధనకాంక్షాధుండై యున్న యద్దేవి ప్రత్యక్షంబై లేలెమ్మువత్సా! నీవాక్యంబులు ప్రతిష్ఠించెదనని వరంబొసంగెను. అతండు భద్రేశ్వరిచే వరంబుం గొని యేకశిలా నగరంబున కేతెంచెను. అనువాక్య కృత్యంబుల పగడీర్చెను.

అంత నస్తమయంబయ్యెను. తూర్పుదిక్కున చంద్రోదయంబయ్యెను. క్రమక్రమంబున జంద్రుని గతిచాదంబున మహానిశీసమయాగతుండగుచుం జంద్రమండలంబు ద్విగుణీకృతమై సిమ్మశింక ఘైత్ప్రయ్వాజనంబులకు నానందంబుగా వెన్నెల గాయ దొడంగెను.

సుదర్శన మిత్రుండది గాంచి యేకశిలానగరంబున నున్న విద్వాంసుల పాదంబుల కొరగి నాయది మానుష ప్రజ్ఞ విహాడనై పరమానవప్రజ్ఞ. మీరు నాకు హస్తి మశకాంత రంబుగాఁ ద్రోద్ధార్థంబు క్షమియించుడని పలికెను.

అంత ప్రతాపరుద్రుండు శాఖ వెల్లి ముగ్గిన తర్వాత భట్టను బ్రహ్మారథం బెక్కించి యేకశిలానగర ప్రవేశము ౧౧ లక్షల వరహాలు సమర్పించెను ఆవిద్వాంసులు సుపరీక్షాది మిత్రుని గౌరవించిరి. అతనికిగా ౧ లక్ష వరహా లిచ్చునంపిరి.

మఱియు నొక్కనాడు సంతూరను గ్రామంబున కృష్ణమాచార్యుల తమ్ముండగు వంతాచార్యులు నిజ స్త్రీ శవంబుఁ గూడెను. ఆవ జనులుద్దగాని బాధించెను. అంతవారు మరణించిరి. అప్పుడా ప్రవులోని శూద్రులో నుగతో గూడియున్నది గనుక మేము తెలియ నైతిమి. అని విని కృష్ణమాచార్యులు తనమనసున విచారించి వాసుదేవమూర్తి గీర్తనం జేసెను. శవంబు దన తలతానే కాష్ఠంబు వలెను జగిగిపోయెను.

ఇదిగని సకలజనంబులు లేచి వచ్చి కృష్ణమాచార్యుల పాదములను బ్రణమిల్లి మా యపరాధంబు క్షమియింపుమని వేడికొండ్రి. ఆ మహాత్మునకు రాగద్వేషంబులు లేవు. మీరు వెరవకుడని పలికెను. అంత ప్రతాపరుద్రుండు చాలచేసిన కృష్ణమాచార్యుల రావించి పూజించి కనకగిరి సీమలో నాల్గవ భాగంబును ౫౦ గ్రామంబుల కధికారంబును నొక్కయగ్రహారంబు నొసంగి పంపెను.

కృష్ణమాచార్యులు సంతూరు ప్రవేశించి సకలధనంబుల బంచిపెట్టెను. కల్యాణను గ్రామంబు కట్టించెను. మూడు వర్షంబు లధికారంబు చేసి గ్రామంబుల గలుగు పదార్థంబు దెప్పించి తామ్రపత్రికలు చేయించెను. ఆపత్రికల మీద దాను రచియించిన చాతుర్లక్ష గ్రంథంబుల వ్రాయించెను. వాటిని శకటంబుల పైనిడుకొని శ్రీరంగంబునకుం బోవ నుద్యోగించెను.

అంత కొందఱు ధూర్తులు గూడి రాజు సముఖంబునకుం బోయి కృష్ణమాచార్యులు మూడేండ్ల కారంబు లిచ్చిన గ్రామంబుల పదార్థంబులుం దెప్పించి తామ్రపత్రంబులుం జేయించి శ్రీరంగంబునకుం గొని పోవుచున్నాడని యోజించిరి. ప్రతాపరుద్రుండది విని యాతని సమాజముగను అతని కేమి కష్టంబా నాకు నదే యిష్టంబని పలికి పంపి ముఖ్యులంజేసి

ఆదేవుడు కరుణించి త్రిపురాంత దేవుని వేడుకొమ్మను మని పలికెను.

అంత రంగనాథుండు మరలఁ త్రిపురాంతంబున కేతెంచి యద్దేవునికి నమస్కరించి తనయెత్తు క్రతువులు సమర్పించుదునని వ్రతంబు జేసి భక్తిమయంబుగా నొక్క రగడ చెప్పెను. అద్దేవుండు ప్రసన్నుండై రంగనాథునకు నిలువు కన్నులొసంగెను. రంగనాథుండంత పాలకుర్తి కిం జని సోమనాథునిచే దీక్షగైకొని యాయయ్య యొద్ద శివరహస్యంబులు దెలిసి కొనుచుండెను.

* రంగనాథుని రగడ యీక్రింద నుదహరించు చున్నవాడ.

క. శ్రీపార్వతీశుఁ జూడను, పాపాత్ముండనగుచుఁ బోవఁ, బధమునఁ జక్షుల్
దీపించు దృష్టి తొలఁగిన శ్రీపతి నను గంగఁ జెప్పె శివుఁ గర్తనుగాఁ.

రగడ. శ్రీశైల వల్లభుని శిఖరంబుఁ బొడగంటి
కాశీపురాధీశు గారిమఁ బొడగంటి
మహినొప్పు శ్రీశైల మహిమ నేఁ బొడగంటి
బహువేద శాస్త్రముల్ ప్రణుతి సేయుటఁ గంటి
భూలోక కైలాస పురమనఁగఁ గనుఁగొంటి
ఫాలాక్షుఁ డిచ్చోటఁ బాయకుండుటఁ గంటి
ధృతిఁ దూర్పు మొగసాలఁ ద్రిపురాంతకము గంటి
పర్వత లింగంబుఁ బ్రాణేశుఁడని కంటి
పర్వతేశ్వరు హృదయ పద్మనిలయునిఁ గంటి

---

*సోమనాథు పురాణ గురురాజ చరిత్రము లందువలెనూ ప్రతాప రుద్ర చరిత్రయందును రంగనాథుఁడనియే గలదు. ఈరగడలో "శ్రీరంగకవి" యని పేరున్నది. రెండు నొక్కని పేర్లే యనియూ నిది వైష్ణవము వీడిన తర్వాతి పేరుగా వచ్చు నని వేటూరు ప్రభాకర శాస్త్రిగారు వ్రాసినారు. మల్లికార్జున స్వామిని దర్శింపకపోవుటచేఁ గనులంపోవుట, అట్లుపోవుటకుఁ గారణ మడుగఁగా శ్రీపతి (అహోబల నృసింహుఁడు) శివుఁడే కర్తయని తెలుపుట కృత్యాది పద్యమునఁ గలదు. సభలందు భక్తులు జయపెట్టి వానిగ్రహమునఁ బోయిన కన్నులు మరల వచ్చుట రగడలో గలదు.

[బసవపురాణము పీఠిక]

భక్తు లప్రతిహత ప్రతిభమతు లనికంటి
భక్తులకుఁ బ్రత్యర్థి పరులు లేరని కంటి
భక్తు లాపదలఁ జేఁ బట్టుపడరని కంటి
శివభక్తి దూషకులు చిరపాపులని కంటి
శివభక్తి దూషకులు చెడిపోదురని కంటి
త్రిభువనము భక్తులకుఁ దృణ కణంబని కంటి
సభలందు భక్తులకు జయవాదమని కంటి
గౌరీశుఁడే సర్వకర్తగాఁ బొడగంటి
కారుణ్యమున శివుఁడు గనిపించె ననికంటి
బహుపాపములు నన్నుఁ బట్టివిడచుటఁ గంటి
నయముగా నయనములు నాకీయఁ బొడగంటి
భయభక్తులను భర్గుపాదములు పొడగంటి
నిదిపుణ్య మనికంటి నిదిగణ్య మనికంటి
నిదియోగ మనికంటి నిదిభోగ మనికంటి
నిదిధర్మ మనికంటి నిదిమర్మ మనికంటి
నిదినిత్య మనికంటి నిదిసత్య మనికంటి
నింక శ్రీగిరిఁ జేరనే గందునని కంటి
శంకరుని కృపవడయు సమయమిది యనికంటి
నింకనామెత్తు కృతులిత్తునని పొడగంటి
నింకఁగృతిసెప్ప నాకేమి భరమని కంటి
పదిఁగృతుల్ నామెత్తు వచ్చునని పొడగంటి
తనరశ్రీరంగకవి దాతయని పొడగంటి
భువిలోపలఁ బ్రసిద్ధ పుణ్యుఁడని పొడగంటి.

ఈ విషయమే శివయోగసార పూర్వభాగమందలి కవిస్తుతిలో నీయాక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

క. అసమ శివభక్తి రసమానసునిం బాల్కురుకి సోమనాథునిఁ గవితా
జనమున్నతయగు సద్యఃప్రసాదియనుచు కవిపాణి,రంగఁ గొలుతుర్.

## —* సోమనాథుని ప్రభావము. *—

అంత నిక్కడ ప్రతాపరుద్రుండు సోమనాథుని ప్రభావంబు విని యాశ్చర్యంబు నొందెను. అప్పుడు తన మంత్రియగు పాలకుర్తిసూరయ్య యా ప్రతాపరుద్రున కిట్లనియె. పాలకుర్తి సోమనాథుండు చెప్పిన శివకథలు దేవరవారు ఉప్పల శంభుని సేవింప బోయి నప్పుడు గూర్చుండి వినవచ్చునని వచించెను. మరునాడు ఆరాధ్య చరిత్ర రాజు వినుచుండగాఁ గొందఱు ధూర్తజనులు పాలకుర్తి సోమనాథుండు చెప్పినవి నూతనంబులు గాని యాద్యంతంబులు గావని నిరాకరించిరి. ఆ ప్రతాపరుద్రుండంత దననివాసంబునకుం జనియె.

అచ్చటి శివభక్తులు సిగ్గుపడి పాలకుర్తి జని సోమనాథున కెఱింగించిరి. సోమనాథుండు శైవులు గానివారలఁ జూడకుండుటం జేసి యొక్కబాడిపై గుడారంబునిచి యందుతాను గూర్చుండెను. లింగముద్రగల యెడ్లగట్టించెను. సూర్య మంత్రిని సూతునిగఁ జేసి ఏకామ్ర గురుండును రంగ నాథుండును మొదలుగాగల శైవులందరు తన్నుగొలువ నేకశిలానగరంబున కేతెంచెను.

ఆబండి గట్టినయెడ్లు కవాటము జొరకున్న నెఱింగి, గవినియడ్డదూలంబున భద్రప్రతిమయు రెండుయేనుగు లుండగా జేసినట్లు దెలిసికొనెను. అంతట సోమనాథుండు శివుని ధ్యానించి యాప్రతిమల పైన భస్మచల్లిన నవితునకలై క్రిందపడెను. అంత నేకశిలానగరంబున దనశిష్యుండగు ఇందులూరి యన్నమదేవు నివాసంబున కేగెను.

ఆ ప్రతాప రుద్రుండీసంగతి యెఱింగి విస్మయం బందెను. కొందఱు ధూర్తులు సహింపఁ జాలక శిలలు దెగిపడుట మంత్ర విద్యగాని వాక్యసిద్ధికాదు. ఇతని సమీపమునకుబోయి యాగుట్టు తెలిసికొని యిప్పుడె వచ్చెదమని రాజుచే ననుజ్ఞగొని యాసోమనాథుని సమీపమునకుజనిరి. కానియతం డన్యమతస్థులఁ జూడకుండెను.

అంతనా ద్వారపాలకులచేత నివారితులై మగుడి పురవీధి కేతెం

చి గుంపులుగూడి కటకటా! వేదశాస్త్రసంపన్నులఁ జూడరాదట. చం డాలుఁడైన నమలింగధారుండైన మాట్లాడి చూడవచ్చునట. అట్లకాకయు ని యితనిని హాస్యంబుచేసి యీప్రొద్దే పురంబు వెడలనంప వలయునని తలంచిరి. ఆపురిలోపల గ్రాసార్థమై తిరుగు యంగహీనులనుండి మొండి ముక్కిడి వెట్టివాండ్లను నంధులను బధిరులను మూకులను మఱియు గో తజనుల రావించి, మీరు సోమనాథుని హాస్యంబుచేసి వచ్చితిరేని మీా కు అన్నవస్త్రంబు లిచ్చెదము. అనివారిని యొడంబరిచి, వారికి లింగధా రణంబు విభూతిరుద్రాక్ష ధారులం జేసి కొన్నికుయుక్తులు జెప్పి పనిపిరి.

వారిలు సోమనాథుని సముఖంబునకుం జనిరి. ఆయయ్య ద్వార పాలకులచే నావార్త నెఱింగి తనసముఖంబునకు వారలఁ బిలిపించు కొ నెను. అంతటనతని ప్రభావంబునం జేసి యంగ హీనులకు నంగంబును, యంధులకు గన్నులును, బధిరులకు వీనులును, మూగులకు వాక్యంబు లును, గలిగెను. వారలత్యంత సంతోషంబున నాయయ్యకు నమస్క రించి, బహువిధంబులఁ గొనియాడి సోమనాథునిచేత ననుజ్ఞాతులై పురి వీధికే తెంచిరి.

సకలజనంబులు నామూగ బధిర యంగహీనంబులు నివారణం బగుటజూచి యీసోమనాథుని మహిమ గొనియాడిరి. ఆధూర్త జనులు లజ్జజెందిరి. ఆప్రతాప రుద్రుండు విభూతిరుద్రాక్షలధరించువాడు గనుక నాయయ్యవద్ద కేతెంచి సేవించితనకుశివుండు ప్రత్యక్షంబగుటెఱింగించు మని వేడుకొన్నఁ గరుణించి యీప్రతాప రుద్రునకు సోమనాథుం డిట్లని యె. శివుండు భక్తిసులభుండు. ఒక్క వ్రతంబు చేబట్టి నడుపుము వ్ర తంబు భంగంబుగాకుండ నడిచితివేని శివుండు ప్రత్యక్షంబగునని యెఱిం గించెను.

—* రాజువ్రతముకట్టుట— ఈశ్వరసాక్షాత్కారము.*—

ఆరాజు శివదేవయ్యను జూచి మెట్టవ్రతంబుఁ జేయ వలయునని

యడిగెను. అంతరాజునకు నాతఁడు, భాగీరథీజలంబుల నభిషేకంబుగా వించిగాని భుజింపనని వ్రతంబుపట్టుమని యెఱింగించెను. అట్లకాక యని నిజ నివాసంబున కరిగి నిత్యంబును భాగీరథి జలంబుచేనభిషేకంబు లు గావించుకొనుటకుఁ ద్రాగుటకు, భాగీరథి జలంబులు దెచ్చునట్లుగా ౩౫౦౦ పరిజనంబుల నేర్పరచి నిత్యకృత్యంబుగ భాగీరథి జలంబులు దె ప్పించి శంభులింగంబున కభిషేకంబు జేయుచుండెను.

వర్షత్రయంబు జనెను ఈశ్వరుండు ప్రతాపరుద్రుని దృఢభక్తి ని జూడఁ గోరి యేడుదినంబులు భాగీరథి జలంబులు రాకుండునట్లు మహా వర్షంబు గురిపించెను. ప్రళయ కాలమేఘంబు రీతి నురుములు మెరుపు లు మహావాయువునుగలుఁగ భాగీరథి జలంబులుదెచ్చు జనంబులు రా లేకయిట్టె పల్లంబు లెఱుఁగరాక వానచేత నుక్కాక మూలకొదిగిరి.

ఇక్కడ ప్రతాపరుద్రుండు భాగీరథి జలంబులు రాకుండు టం జూచి యేడుదివసంబులు యుపవసించి నిత్యము త్రికాలంబును బూజ సేయు వచ్చుచుండెను. అంత మరునాడు ప్రభాతసమయంబున బ్రతా పరుద్రుండును మహాదేవుని గుడిలోనికి జనుదెంచు సమయంబున ఖడ్గ ఖేటకంబులును, మీయదపుజడ్డు పట్టికొని పరిజనంబులు తమ్ముఁగొ లిచి వచ్చుచుండ కోటసమీప వీధిలోపల మహావాయువుచే ఖడ్గఖేట కంబు లెగిరి పోయినవి పిడుగులును వాయువులును వానయు నూడ నొక్కతడవవిడినచ్చిన నోర్వలేక పరిజనంబులు నేల పైఁబడిరి.

రాజుచలింపక ధైర్యంబు వహించియుపవాసంబుల సొక్కకబు ద్ధిచెలింప నేకభక్తిమరువక వేసారక శంభుని నరికెఁ బోన శక్యంబుగా కపెద్దగ నెలుగెత్తి శంభులింగా! మహాదేవా! నీలకంఠా! మృత్యుంజ యా! కైలాసనివాసా! యనిపిలువ సాగెను.

### —* కాశీబుగ్గ యుత్పత్తి *—

ఆక్షణంబున నందివాహనా రూఢుండై ప్రమథగణంబులు గొ

లువ నీశ్వరుండు ప్రత్యక్షుంబయ్యెను. అంత నిర్మలంబై సూర్యమండలంబు గానంబడెను. ప్రతాపరుద్రుండు శంభు లింగంబునకు సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి బహువిధంబుల స్తుతించెను.

అద్దేవుండుమెచ్చి నీకు వరంబు లిచ్చెద నడుగుమన ప్రతాపరుద్రుండంత మకుళిత హస్తుడై వ్రత భంగంబు గాకుండునట్లు గృపసేయుమనెను. అంత శంకరుండు మెచ్చి యప్పురంబునకు నుత్తర భాగంబున గోశమాత్రంబున భాగీరథీజలంబుల బుగ్గ గజతుండ సమానంబై మీకు గానవచ్చు. నీవ్రతంబు చెల్లుచుండు. నీవు గంగాగర్భంబున శరీరంబు దొలంగి దివ్యవిమానా రూఢుండవై కైలాసంబునకు వచ్చెదవని వరంబొసంగెను.

శివుండు ప్రత్యక్షుండైన చోట శివాలయంబు గట్టించెను. అంత ప్రతాపరుద్రుండు సకలజన సమేతుండై పంచమహా వాయిద్యంబులు మ్రోవ మహావైభవంబుతోఁ బురంబు వెలువడి యక్కడికివచ్చి యొక ప్రదేశంబున వారిని నిలిపి శంకరుని ప్రార్థింప సాగెను. అట్టిసమయంబున గజతుండ సమంబై చంద్రప్రకాశంబైన భాగీరథీ జలంబులబుగ్గ బయలువెడలి వచ్చెను. ఆజలంబులను ప్రతాపరుద్రుండు చూచి యత్యంత సంతోషంబున సర్వజనంబులు తానును స్నానంబుచేసిరి. అక్కడనే శివాలయంబులు గట్టించెను. ఎనిమిది తులాభారంబులు దూగికోటిసువర్ణంబులు దానంబుచేసెను.

మఱియునాజలంబులను హేమకుంభంబులనుంచి మదగజకుంభంబుపై నిడుకొని మహావైభవంబుతో శంభులింగంబునకుఁజని యభిషేకంబుగావించి నైవేద్యంబులు సమర్పించెను. బంధుహిత సామంతవర్గంబులతోఁ గూర్చుండి శ్రీమత్ప్రతాప రుద్రుండు రెండవ దేవేంద్రుండుపోలె సకలవిభూతి సంపన్నుండై సింహాసనాసీనుండై యుండెను.

అట్టిసమయంబున నోరుగంటి సోమనాథుండా దేశంబున వ్రతంబు చెల్లిన దక్షిణదేశంబునకుఁ బోయెదనని పచించిన ప్రతాపరుద్రు

జ్ఞాకు గ్రామంబు నగ్రహారంబుగ నొసంగి పంపెను. ఆయయ్యను నుమతంబున రంగనాథుని దనవద్దనుంచుకొనెను. అపారంబుగ ధనంబులచరిత్రంబులకు చెల్లింపు చుండు.

## —*ప్రతాపరుద్రుండు తనపైకియుద్ధమునకువచ్చిన పశ్చిమదేశాధీశ్వరుల జయించుట.*—

ఈప్రకారంబునప్రతాపరుద్రుండు రాజ్యంబుసేయుచుండ దనయాజ్ఞమీరిన పశ్చిమ దేశాధీశ్వరులగు తురుష్కులపై దళంబులబంపి వారి నోడించెను. పత్నీయుక్తంబుగా వారినిఏకశిలానగరంబులో గిరి వేయించెను

ఆసమయంబున దేవగిరినున్న రామదేవరాజు పారసీరాజు తమ్ముని గలిసికొనెను. ఇక్కడ నేకశిలానగరి గిరి వేసిన పారసీరాజు మృతిబొందెను. అతనియనుజుండు జుమానుముల్కు ఫకీరు వేషంబున నేకశిలానగరంబు జొచ్చి పురంబాతయు జూచి తనచేత సాధ్యంబు గాకుండు టెరింగి తనయన్న సతికిని సుతులకును దానునెరుక జేసికొనెను. తానుఫకీరు వేషంబుచే బురంబు వెడలితినని చెప్పి తమరాజ్యంబునకు వారలనుని లిపి రామదేవరాజులును దానును ఢిల్లీకి బోయిరి. సుల్తానునజూచి యేకశిలానగరంబు తెరంగు బలంబుకొలంది చెప్పకొంచుంబని కార్యంబూహించి యేకశిలానగరంబు సాధించదలంచిరి.

అప్పుడు సుల్తానుతోడ గూడిన రాజులు పశ్చిమ దేశాధీశ్వరుండు ౧ లక్ష గుఱ్ఱంబులును, ౩ లక్షల పదాతి వర్గంబులును, మహారాష్ట్ర దేశాధీశ్వరుండు ౨ లక్షల గుఱ్ఱంబులును ౨ లక్షల పదాతి వర్గంబులును, కటకవల్లభుండు ౫౦ వేల గజంబులును, ౮ లక్షల పదాతి వర్గంబులును, తక్కినచిల్లరరాజులు ౩లక్షలగుఱ్ఱంబులును, ౫లక్షలపదాతివర్గంబులును నీవిధంబుగ దళంబులగూర్చుకొని రాచర్లవద్దవిడిసిరి.

ఢిల్లీశ్వరుండు మలేఖానుని దళవాయి జేసికొని ౨౫౦ వేలు గుఱ్ఱంబులును,౧౫లక్షల కాల్బలంబులునుగూర్చుకొని యేకశిలానగరంబు

నకు నుత్తరభాగంబున విడిసెను. కటకవల్లభుండు మూల బలంబులతో నేకశిలానగరంబున కీశాన్య భాగమున మాద్గల్యమున విడిసెను. ఇటుల మూడుదిక్కుల విడిసిరి.

ప్రతాపరుద్రుండీసంగతి చారులచేవిని నరపతిరాయుల కెరింగించెను. అతడు 3 లక్షల పదాతి వర్గంబులును, దక్షిణ భాగంబున వేల్పుగొండ స్థానంబుగా గొంత బలంబులు డెబ్బై యేనుగులు పద్మ నాయకులు, రాజు తమ్ముండగు యన్నమ దేవుండును పశ్చిమంబున విడిసిరి. శత్రుబలంబుల మీదికి సేనల బంపించెను. కటక వల్లభుని మీదికి నరపతి రాయలం బంపెను. సుల్తాను బలంబుల మీదికి తనమూల బలంబులను బంపెను. వారు తలపడి ఘోర యుద్ధంబు చేసిరి. ఆసమయంబున మలఘుఖానుండు సమసెను. హతశేష బలంబు ఢిల్లీ మార్గంబుఁబట్టి పారిపోయెను. అటుతరువాతఁ గటక వల్లభునిపై నరపతి రాయలు తలపడి యుద్ధంబుఁ జేసి రెండు వేలగజంబుల ద్రుంచి వెయ్యి గజంబులఁ బట్టికొనెను.

అప్పుడు కటకవల్లభుండు పలాయితుండయ్యెను. అంత హతశేషులైన వారలు ఢిల్లీకింజని సుల్తానుకుఁ జెప్పిరి. మరల బలంబుల గూర్చి బిసముఖానుని యుద్ధమునకు బంపెను. వారలు నుత్తర భాగంబున దిగిరి. చిల్లరరాజు లెప్పటియట్లు బలంబుల గూర్చికొని పశ్చిమంబున విడిసిరి. కటకవల్లభుండు బలంబుల గూర్చుకొని పూద్గల్యంబున విడిసెను.

కటకవల్లభునితో నరపతి రాయలు సంగరంబు చేసి ౪ వేల గజంబుల దునిమి వేయిగజంబుల బట్టికొని కటకవల్లభుం దఱుముంచెను. హతశేషులు కటకంబునకుఁ బారిపోయిరి. సుల్తానుబలంబులఁ గూల్చి బిసముఖానునితఱుముంచెను. మరణించఁగజిక్కినబలంబులు వొరలంగి పోయెను. చిల్లరరాజులు పారిపోయిరి.

సింధు కటకంబున ముకుంద సుందరుండను వాఁడు పట్టంబుగట్టుకొని మరలబలంబుల గూర్చుకొని యెప్పటియట్లు మాద్గల్యంబున విడిసెను అటసుల్తాను ఉల్లాఘుఖానుని దళవాయింజేసి 3 లక్షల గుఱ్ఱములు ౧౦ లక్షల పదాతివర్గంబును గూర్చి యేకశిలా నగరంబునకు నుత్త

రభాగంబున విడిసెను ఛిల్లరరాజులు యెప్పటియట్ల బలంబులు గూర్చు కొని కడమూరి రాచర్లవద్ద విడిసిరి. ఎప్పటియట్లు మూడు దిక్కులవారు సంగరంబుచేసి యోడి పోయిరి.

—* ప్రతాపరుద్రుని భటులుకటకవల్లభుండనిముకుందసుందరుని బట్టుకొని తదుపరి విడుదల చేయుట *—

అంత కటక వల్లభుండును ముకుంద సుందరుండును నేకశిలానగరంబుం జూడవలెనని విప్ర వేషంబులం బురంబు జొచ్చిరి. అన్ని వీధులు చూచిరి. ఎప్పటియట్లు కటకవల్లభుండును ముకుందసుంధరుండును, రాజద్వారంబు చూచుచుండిరి. అట్టిసమయంబున నతనిని దొరలు యితడు కటక వల్లభుండని ప్రతాప రుద్రున కెరింగించిరి. ప్రతాప రుద్రుండీ ముకుందసుందరుని పట్టించి గిరి వేయించెను. ఆపురి వైశ్యుండు కోటపల్లి విశ్వనాధుండను వాడు శ్రీమత్ప్రతాప రుద్రునకు మూడు కోట్ల సువర్ణంబులిచ్చి యీ ముకుంద సుందరుని విడిపించెను.

—* కటకవల్లభప్రభృతులగు రాజులుపరాజయమొందుట *—

అంతం గటక వల్లభుండు తనదేశంబుం జేరి నరపతి రాయలతో సంగరంబుజేసి యోడిపోయెను ఉల్లాఖుఖానుడు జగడంబుజేసియోడిపోయెను. అన్నమరాజును జల్లర రాజులతో సంగరంబుజేసి యోడి పోయి తమతమ దేశంబులకుజనిరి.

అంత గటక వల్ల భుండు కటకంబు నకు బోవు వాడై మార్గ ల్యంబున నున్న యగ్గుండంబు నందలి హేమ గోపురంబు చూచెద నని యగ్గుండంబు కడకేగెను. ఈజలంబులు పాతాలనుండి యెదురు గ్రుమ్మనని చెరువుకట్ట త్రవ్వించెను. అంత నాజలంబులు పోయి గుండంబులో మహా ఛాత్రాతంబులు కనుపించెను. కటక వల్లభుండు భయంబంది గజ గజ వణకుచు దన పురంబునకుం జనియె.

## — * ఉల్లాఖు ఖానుకు సంధిచేసి కొనుట * —

తిరిగి బలంబులం గూర్చుకొని యేకశిలా నగరంబునకు నెప్పటి యట్లు వారువిడిసిరి. కనుపరుండు మొదలవారు నెప్పటియట్లువచ్చి విడిసిరి. కటక వల్లభుని పైనరపతిరాయలును ముకుంద రాయలును జిల్లర రాజుల పైనన్నమదేవుండు ౭౭ గురుపద్మనాయకులు రాజాది సుల్తాను బలంబులకు దళవాయిలై యేనుమార్లు పోరిపోరి సాధింప లేక చింతాక్రాంతుడై యున్న ఉల్లాఖు ఖాను సంధి జేయం దలంచెను. అంత నితరజాతి నాయకులు తమనాయకత్వంబులు తీరుగాక! యునితలంచి సంధికి నొడంబడి ౫౦ లక్షలు వరహాలివ్వంజేసి కొనిరి. అప్పుడు ౨౫ లక్షలు పుచ్చుకొని కార్యాంతరంబున ౨౫ లక్షలిచ్చు నటులొడంబరచుకొని యేకశిలా నగరంబునకు వచ్చిరి.

అంత వారు ప్రతాపరుద్రుని సన్నిధికి వచ్చి స్వామి హితవరుల జూచి యిట్లనిరి. దేవరవు మాకు రణరంగంబున ననుజ్ఞ యివ్వవలెను. దేవరవారుచూచు చుండ సుల్తాను దళంబుం గూల్చి ఉల్లాఖు ఖానుంబట్టితెచ్చిమీకుగానుకగా నిచ్చెదము నవలక్షలధనుర్ధరులకుంగయ్యంబులుమీ కేచూచుచుంటిరి. నేను మాకయ్యంబు మీరే చూడవలయునని పంతంబులాడిరి. అంతరాజు ౯ లక్షల పదాతి వర్గంబులను నిచ్చెను. అంతట ఉల్లాఖు ఖానుండు 3 లక్షల పదాతి వర్గంబుల తోటి తరలి భోజారెడ్డిని బిలిపించుకొని సంధిచేసి కొనెను. ఆక్షణముండె ౧౦లక్షల వరహాలిచ్చి కడమవి కార్యాంతరంబున నివ్వంజేసి కొనెను.

## —* ప్రతాపరుద్రునికి దైవికశక్తి దొలగుట *—

తదనంతరంబున రాజు సమ్ముఖంబునకు బరుసవేది పూజార్లు వచ్చి శంభులింగంబునందు స్పర్శంజేసినలోహంబు సువర్ణంబు గాదయ్యె. జ్యోతిర్మయంబుగు తేజంబు నిలుపదయ్యె నని విన్నవించిరి. ప్రతాపరుద్రుండిది విని వెఱగుపడెను. దేవరప్రసాదంబు తనకుం దొలగుట నెరింగెను. అంతట యుద్ధరంగంబునకు సన్నద్ధుండై హనుమకొండ సిద్ధేశ్వ

రు నారాధించి యనంతరము పద్మాక్షి బూజించి యద్దేవిపూర్వదత్తం బైన ఖడ్గఖేటకంబులు దేవి సమీపంబున సమర్పించెను.

అంతట ఖడ్గంబు సర్పాకారంబై పద్మాక్షిదేవి వదన గహ్వరంబు దూరిపోయెను. ఆఖేటకం బంగరాగంబు చందంబున నద్దేవివక్షస్థలంబు నందు లిప్తంబయ్యెను. దానినిజూచి శివ దేవయ్యయు శాఖవెల్లి మల్లికార్జునుండు మొదలుగాగల పెద్దలు ప్రతాప రుద్రునకు నిట్లనిరి. ఖడ్గఖేట కంబులు తొల్లిసాధన పర్మకిచ్చినప్పుడాదేవి, యిది మొదలు మీసింహాసనంబు సహస్ర వర్షంబు లుండునని యానతిచ్చెను. నేటివఱకు సహస్రవర్షంబులు జరిగి పోయినవి. కావునింక మానుష శక్తియే కాని తొల్లిటిరీతి దైవశక్తి లేదని వారువచించిరి.

—* ప్రతాపరుద్రుండు పట్టుబడుట *—

ప్రతాపరుద్రుండు దీనిని చింతాక్రాంతుం డయ్యెను. పద్మాక్షి దేవిని పెక్కువిధంబుల స్తుతించి సకలజనంబులతోడ దాను నిజనివాసంబున కేతెంచెను. పరుసవేది లింగంబునకు సాష్టాంగ దండప్రణామంబులాచరించెను. మరునాడు కదనకృత్యంబునకు నాయత్తపడెను. కటక పల్లభునిపై నరపతిరాయుల బంపెను. జమాను ముల్కుపై అన్నమదేవుని పద్మనాయకులను నవలక్షధనుర్ధరులను బంపెను. సింధురాజును గూల్చి పశ్చిమంబునకు టిప్పుసుల్తాను బలంబుల మీదికి ప్రతాపరుద్రుండు, యితరజాతి నాయకులు ౫ లక్షలును, భోజారెడ్డి 3 లక్షలును, దక్షిణ రాజులును, కన్నోజురాజు ౨ లక్షల గుఱ్ఱంబులును, వీరపాండ్యరాజు ౮ వేల యేనుగులును, దనకాసామిపు టేనుగులు ౨౦౦ లును, తన్ను గొలిచిరాగ, మదగజారూఢుండై మౌక్తికఛత్ర చామరంబులు శోభిల్ల యుద్ధంబునకు జనుదెంచెను యుద్ధంబు సేయు సమయంబున నితరజాతినాయకులు కొంత జగడంబుచేసి కడకుం జనిరి. వారింజూచి, తేనాల భోజారెడ్డి యుద్ధంబుజాలించి కడకుం జనెను. మరియు దక్షిణ రాజులు యుద్ధంబు చేసి కొంతబలంబుజంపి తామునమసిరి. వీరపాండ్యరాజు ఘోరయుద్ధంబు చే

సి బలంబులతోఁగూడ సమసెను.

ఇట్లు సర్వసేనలు సమసిన శాలివాహన శకము ౧౨౯౧ రుధిరోద్గారి సంవత్సర ఆశ్వయుజ బ ౨ గురువారమునాఁడు యుద్ధరంగంబున గజారూఢుండై యున్న సమయంబున ప్రతాపరుద్రుండు పట్టుబడినెను. అన్నమదేవుండును జైత్ర యేడుగురు పద్మనాయకులు లిదివిని శోకమోహంబుల మనంబెనంగొన జునాఖానుమల్కపై సేగియెదిరించి ఘోరయుద్ధంబుఁజేసి యాతని తల్క్రిందించిరి.

అంతట జునాఖాను మల్క తమ్ముఁడగు సిద్దిఖానుండు నాతిశేషులను ఉల్లాఖుఖానుని గలిసికొనెను. ఉల్లాఖు ఖానుండు సిద్దిఖానుండద్దఱు విచారించుకొని ప్రతాపరుద్రుని ఢిల్లీశ్వరు సముఖంబునకు బంపనూహించిరి.

రాత్రియగుటయు నితరజాతి నాయకులుతమకునెడబడినరతి ౨౫ లక్షలవరహాలిమ్మని ఉల్లాఖుఖానుని యడిగిన నతఁడునితరజాతి నాయకులతోమున్ను మీకునిచ్చిన ౨౫ లక్షలుమగుడనిమ్మని వారిబాధించెను.

ఈవార్త సర్వంబును ప్రతాప రుద్రుండువిని తహతహపడి తాను రణాశక్తుఁడై తెచ్చిన వాసలో ౨౫ లక్షల వరహాలు సుల్తాను దళవాయైన ఉల్లాఖు ఖానుకు నిప్పించి, యితరజాతి నాయకుల బిలిపించెను. అంతనిగ్గుపడి ప్రతాప రుద్రుని దయావితరణంబులు దలంచి యితరజాతి నాయకులును, తేరాల భోజారెడ్డియు విచారించుకొని ప్రతాపరుద్రుని విడిపించుకొనువారమని శపథంబులు బలుకుచు జనుదెంచిరి

అప్పుడు సుల్తానుదళంబుల లక్షగుఱ్ఱంబులును ౮ లక్షల పదాతి వర్గంబులును వెనుకనిల్పి ఢిల్లీమార్గంబుఁ బట్టిపోవుచుండెను. రామగిరి చెరువ నితరజాతినాయలు భోజారెడ్డి మున్నగువారు సుల్తానుబలంబుల బోనివ్వక యడ్డగట్టియుద్ధంబు నకుఁ దలపడి రెండుఝామములు ఘోరయుద్ధంబుజేసి ౫౦ వేల గుఱ్ఱంబులును ౩౦ లక్షలపదాతి వర్గంబులను గూల్చి యితర జాతి నాయకులు నిరవశేషంబుగా మడిసిరి.

# అనుబంధము

మ. రా. బొల్లం నాగలింగంగారు మాకార్యాలయమునకు ప్రతాపరుద్ర చరిత్ర నొకటి పంపి యుండిరి. దానియందలి విశేషములింకు బొందు పరచు చున్నారము.

## ప్రతాపరుద్ర చరిత్రము

(ద్వితీయ ప్రతియందుగల విశేషములు) (రుద్రుని పరిపాలనమందు)

ద్వాదశ యోజన విస్తీర్ణంబు గాగల యోరుగల్లు పట్టణంబునకు మున్నూట యరువది సోమసూర్యాద్యాలయములు మూడువేల శివాలయములు. మున్నూరు విష్ణ్వాలయములు కట్టించెను. మఱియు గంచుకోట యిటికకోట రాతికోట పుట్టకోట భూమికోట కంపకోట గవిని కోటయను యేడుకోటల నిర్మించెను.

మొదట కంచుకోటలో రుద్రమహారాజ గృహంబులును నిటికకోట లోపల బరుసవేదిలింగంబును, దానికి నైఋతి దిగ్భాగంబున విరూపాక్షరాజులును, నెరుకు కోయరాజులు పశ్చిమ భాగంబున, దేవరాజుగారు ఉత్తర భాగంబున దక్కిన రాజగృహంబులు దూర్పుభాగంబున, స్నానసంధ్యాద్యనుష్ఠానజపపరాయణులైయగ్నిహోత్రనిత్యకర్మానుష్ఠానాధ్యయన పరాయణులైయున్న బ్రాహ్మణోత్తముల గృహంబులు రాతికోట లోపల, వైశ్యగణ సమూహముగృహంబులు భూమికోటలోపల, దక్కినయష్టాదశ కులంబులవారు బుట్టకోటలోపల నివసించియుందురు.

సకల సుఖములు పాడిపంటలు ధనధాన్య సమృద్ధియు మరకత మాణిక్య గోమేధిక పుష్యరాగ వజ్ర వైడూర్యంబులు మహదైశ్వర్యంబులు గలిగి సమస్తరాజులచేత బాలింపుచుండ సువర్ణ వర్షంబుయేడు గడియలు కురిసెను. సకలసేనా పరివార సహితుండై రుద్రుండు జాగరూకుండై చతుస్సముద్ర పర్యంతరంబు రాజ్యంబు పాలింపుచుండె.

ఆసమయంబున విరూపాక్షరాజు నెరుకుకోయరాజులు దేవరాజులను మొదలయిన రాజులలో నాల్గుదిక్కులనల్గురు రాజులనుబంపిచిరాజ్యపరిపాలన మాజ్ఞాపించి తాను సింహాసన స్థుండై సుఖంబున నేలుచుండె.

విరూపాక్షు రాజులు మొదలగు నల్గురురాజులు తటాకంబులును వనంబులును దుర్గంబులును ననేక శివాలయంబులును నిర్మించి యనే

క బ్రాహ్మణాగ్రహార వృత్తి క్షేత్రంబులు గల్పించి సమస్తదేశముల రాజులవద్ద యప్పనములఁ బుచ్చుకొనుచు రాజ్యపరిపాలన చేయుచుండిరి.

రుద్రుండు తన ప్రధాన వర్గంబులగు గంధర్వులు— గజదేవ— మధవదేవ— సోమదేవ— బొమ్మిశెట్టి— సూర్యదేవ— రామిదేవ— మంచనదేవ— విశ్వంభరదేవ— అన్న[illegible]దేవ— కాంచనదేవ— రాజదేవ— మంత్రులతో రాజ్యంబు సేయుచుఁ బితృహత్యాదోషంబునఁ బ్రధాన వర్గంబును బిలిపించిపితృహత్యాదోషంబు పరిహారణార్థంబు ప్రాయంబడిగిన, వారు పన్నిద్దరు ప్రధానులు విచారించి మహాతపో గరిష్ఠుండైన శ్రీవత్స గోత్రోద్భవుండయిన శివదేవయ్య గారి యనుగ్రహపాత్రుడవై వారిని బూజింపుచున్న తొలంగునని యాతని ప్రభావంబు రుద్రునకుఁ జెప్పిరి.

అప్పుడు రుద్రుండు దేవగురురాయ! అని స్తుతిచేసి శివదేవయ్యగారి పాదపద్మంబుల కొఱగి నాపితృహత్యా దోషంబును నివారించుమని, వారివలనమహాదనుగ్రహ పాత్రుండై భస్మరుద్రాక్షుల మహిమంబుదెలిసికొని త్రికాలములయందుఁ బసవేది శంభులింగస్వామిని,నభిషేకభస్మగంధాక్షతధూపదీప నైవేద్య తాంబూలంబుల తోడనునృత్యగీతవాద్యభేరీమృదంగాదినాట్యంబులఝుంకారంబులతోడనుపూజగావించుచుండెను.

అప్పుడష్టాదశ వర్ణంబులవారు రుద్రుని దోషము పోలేదని యనుకొనగ నామాటలు రాజువిని తనకు దోషపరిహారదృష్టాంతముచూపించవలెనని శివదేవయ్య గారికి నమస్కారంబుచేసి యడిగెను.

అప్పుడువారుతారకోపదేశ స్థలమును నానంద కాననమును రుద్రావాసంబును మహాశ్మశానంబునగు కాశియనే పట్టణంబున గంగాస్నానము జేసికొనుచు విశ్వేశ్వరునివిశాలాక్షినియన్నపూర్ణను భైరవగణపతులను సేవించుకొనుచుఁ ద్రిలోక గురుమూర్తియై మహాతపోగరిష్ఠుండైన యుద్భటుని వంశస్థులున్న వారలు. దోషనివారణమునకును, నిదర్శనము జూపించుటకును, సమర్థులని శివదేవయ్య రాజులకుఁ జెప్పెను.

అప్పుడురాజులందఱువారిచ్చటికివచ్చు నటుపాయంబు చేయుమనిశివ

దేవయ్యగారితోఁ జెప్పిరి. అప్పుడు శివదేవయ్యగారు కాశీపట్టణంబునకుఁ బోయి మల్లనారాధ్యులవారిని ఓరుగల్లు పట్టణమునకుఁ దీసికొనివచ్చిరి.

అప్పుడు శివదేవయ్యగారు రుద్రుఁడు మొదలయిన రాజులతోఁ జతురంగ బలాదులతోఁ గూడ మల్లనారాధ్యుల వారికి నెదురుగాఁబోయి నమస్కారముచేసి వారిని శంభులింగస్వామి వద్దికిఁ దీసికొనివచ్చిరి.

అనంతరము శివదేవయ్యగారు మల్లనారాధ్యులకు రుద్రుని పితృదోష నివారణార్థము శంభులింగస్వామినిపలికించుమని యనిరి. అంత మల్లనారాధ్యులవారు శంభులింగ స్వామిని రుద్రుని దోషము పోయెనని యేఁకుఁకుఁడియలు ప్రణవ స్వరముచేత పలికించెను.

అప్పుడు శివదేవయ్యగారు దప్ప సమస్తరాజులు అష్టాదశ వర్ణముల వారును చతురంగ బలాదుల సమేతముగ మూర్ఛచెందిరి. అంత శివదేవయ్యగారు మల్లనారాధ్యులతో మునుపు పలికిన పలుకు శంభులింగ స్వామిని నాజ్ఞాపించుమని యనిరి. అప్పుడు మల్లనారాధ్యులు పరుసవేది లింగమును జూడగనే శబ్దమణిగెను. అందఱు మేల్కొనిరి.

అప్పుడు రుద్రుఁడు విరూపాక్షరాజు మొదలయిన రాజులు మల్లనారాధ్యులవారికి నమస్కారంబులుచేసి- యనేక మహాదానంబు లిచ్చి- గురుమూర్తులయిన శివదేవయ్యగారి కుమార్తెను మల్లనారాధ్యులవారికివివాహంబుగావించిరి. మఱియు వారికిముదిగొండ తాలూకాయందు గ్రామంబు లగ్రహారంబులుగనిచ్చి వారినిముదిగొండ ప్రవేశించఁబెట్టిరి.

ముదిగొండ దగ్గఱ మల్లనారాధ్యులవారి శిష్యుఁడు మనుమన్న యనేరాజు వెలుగూరనే గ్రామమున కిల్లా కట్టించి తటాకములు నిర్మించెను. కోనేళ్లు త్రవ్వించెను. వనంబులు వేయించెను. మల్లనారాధ్యుల వారినిఁ బోషించుచుఁ బూజించు చుండెను. ఈమను మన్నయనేరాజువిజయనగరమునకుఁ దూర్పుభాగమున మరొక్కకిల్లాగట్టించెను.

ఇక్కడ శివదేవయ్యగారికిని రుద్రుఁడు రాజులు సమస్త ప్రధాన వర్గములును సమస్త రాజ్య భారములును జరుపు చుండుమని వదించి యగ్రహారములిచ్చి వారిచేత నాశీర్వచనములు పుచ్చుకొను చుండిరి.

(వీరప్రతాపరుద్రుని పరిపాలన మందు)

పాలకుర్తి సోమనారాధ్యుల వారు బసవపురాణాది గ్రంథములు రచింపగా బ్రాహ్మణులు కొందఱు రాజుదగ్గఱ కేగి సోమనారాధ్యులు వేదాధ్యయనముల శూద్రులపాలు చేసెననిరి. అంత ప్రతాపరుద్రుఁడు సోమనారాధ్యుని బ్రాహ్మణోత్తములను బిలిపించి విమర్శన చేసికొనుమని వచించెను. సోమనారాధ్యులవారు యాయూరిలోఁ బోతయ్య యనే రజకునిఁ బిలిపించి వానికి భస్మరుద్రాక్షలు పంచాక్షరి యుపదేశము సూర్యమంత్రిచేతఁ జేయించ గానే నాతఁడు తనపేరు మడివాలయ్య యని పెట్టుకొని తత్ప్రభావమున సకలవిద్యాసంపత్తిగలిగి యాపన్నెండు వేల బ్రాహ్మణులతోఁగూడ వాదించుచున్నానని వేదశాస్త్రపురాణ సూక్తులచేత బ్రాహ్మణోత్తములతో శివుఁడే యధికుఁడని వాదించెను. అప్పుడు బ్రాహ్మణులందఱు నోడి రుద్రునితోఁ దమయూరఁబుట్టిన చాకలివానిచే నోడిలజ్జపడితి మని చెప్పిరి.

ఎటులయినను నిక సోమనారాధ్యులవారిని నోడింపుదుమని తలంచి యాబ్రాహ్మణులు రుద్రునితో సోమనారాధ్యుల దర్శనము చేయవలసినదనియు, నాతఁడు భవి ముఖము చూడని వాఁడగుటచే పరుసవేది లింగమూర్తిని కౌగిలించుకొని యుండుఁ డనియు దర్శనమయ్యే టప్పుడు మాత్రము చేతులు వదలుఁడనియుఁ జెప్పిరి.

అటులే దర్శనమయ్యే యప్పుడు చేతులు వదలవలెనని రుద్రుఁడు ప్రయత్నముచేయఁగాఁ జేతులువదిలి రాకపోయెను. అప్పుడు సోమనారాధ్యుల వారు కపటమును గుర్తెరింగి ఓరుగల్లు వదలి దండకారణ్యమునఁ గోటి కాంద్ర భూములలో నుండుమని శాపంబెట్టిరి.

సోమనారాధ్యుల వారా పన్నెండు వేల బ్రాహ్మణులను మడివాలయ్య గారివద్ద భస్మరుద్రాక్ష పంచాక్షరి మంత్రోపదేశమునుగమ్మని శాపంబిచ్చిరి. మడివాలయ్య గారికి నిట్టి ప్రజ్ఞ గలుగుటకుఁ గారణము సోమనారాధ్యుల వారి యనుగ్రహము తప్ప వేరుకాదు.

సోమనారాధ్యులంత ప్రతాపరుద్రునిచే బహుమానముగా నివ్వఁబడిన పాలకుర్తిని ప్రవేశించెను.

## తప్పొప్పుల పట్టిక.

| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| ౩ | ౧౭ | (శ్రీ)నగరంబు | మఱియునాతఁడు శ్రీనగరంబు |
| ౬ | ౬ | నయ్యగహారంబులకుపద | నపద |
| ౭ | ౧ | నరకంబని | నరక హేతువని |
| ,, | ౨ | యందు | యశ్వాను |
| ,, | ౨౩ | ఆయుధ | సిరాయుధ |
| ౮ | ౮ | వహ్నినకా | వహ్నికా |
| ౧౦ | ౧ | వర్ణజన | పర్ణజనన |
| ,, | ౨ | ప్రసూతి | ప్రసూత |
| ౧౧ | ౩ | యూవలియుతజ | యూవళియుజ |
| ౧౬ | ౧౯ | యంత | యనంత |
| ౨౧ | ౧౩ | ప్రజాస్వయము | ప్రజాసమేతము |
| ౨౨ | ౨౨ | డనా | బడనా |
| ౨౪ | ౨౬ | విన | నవి |
| ౨౯ | ౪ | హాజు | హారాజు |
| ౩౦ | ౧౫ | ననన్యాయంబున | నకారణంబున |
| ౩౮ | ౩ | గుచిమకోమలాకృష్ణంబు | గుసుమకోమలంబు |
| ,, | ౯ | నుహిపరూపుం | మహిపవాహనుం |
| ,, | ౧౭ | మూడురాయగండపిం | మూరురాయగండపెం |
| ,, | ౨౧ | తాను | ఆతఁడు |
| ౪౧ | ౧౩ | శర్మ | వర్మ |
| ,, | ౧౬ | మార్జ | మార్గ |
| ౪౨ | ౧ | గర్భాదానాది | సీమంతాది |
| ౪౩ | ౧౯ | జిలి | జ్వర |
| ౪౮ | ౭ | భుజాయేలితం | భుజాపరిపాలితం |
| ౪౯ | ౧ | ఒకటవ పంక్తి మొదలు పది పంక్తులు పడినవియే ప | |

డినవి గనుక వదిలి పెట్టిచదువఁ గొన వలెను.

| | | | |
| --- | --- | --- | --- |
| ౫౧ | ౩ | పుగ్గెలు | పోలేరులు |

| పేజి | పం. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౫౫ | ౨౫ | వివేకంబులుసత్యార్థ | విశేషంబుగసత్యార్థకరం |
| ౫౬ | ౪ | జన | జని |
| ” | ౬ | ధేవుంలు | ధేనువులు |
| ” | ౨౩ | మజ్జభో | మజ్జనభో |
| ౫౭ | ౯ | గిల్లునసిల్చినసుగంధము | మహీపాలురును |
| ” | ౧౦ | గాసుః సనదీక్షు | నొకశిల్పినచ్చు |
| ” | ” | జ్యోతిషంబుపంచాణ్ణభక్తుద్దూ | పంచాణుడుజ్యోతిషంబువిప్రు |
| ” | ౧౧ | వ్యతీపాతి | వ్యతీపాత |
| ” | ౧౨ | బ్రిమ్మా | గుట్టు |
| ” | ౧౫ | హుంబు | హు |
| ” | ” | హాత్మ్యం | హాత్మ్యం |
| ” | ౧౬ | ఇట్లని | ఇట్లనిరి |
| ” | ౧౭ | లకునెట్టులభించుపరీక్షుజూపినవి | లకుప్రజ్ఞలెట్టులభించు శిల్పిపరీక్షుజూపినదిని |
| ” | ౨౧ | కునుకేనిజ్యోతిష్యంబుపారిసొ | కునేనిజ్యోతిష్యం బాతనిసొ |
| ” | ౨౩ | గనిపరీకులిచ్చెవారు | గనివాడుపరీకునీయక |
| ” | ” | జూచియు | జూచియొకవిప్రుడును |
| ౫౮ | ౬ | మాస్య | మాహాస్య |
| ” | ౧౬ | రూఘుడై | రూఢమై |
| ” | ౧౯ | అను | అంత |
| ౬౨ | ౨౭ | యుశు | యగు |
| ౬౯ | ౨౦ | యుగ్గుడం | గుడం |
| | ౨౧ | యగ్గుడు | గుడు |
| ౭౨ | ౪ | ఘుపై | ఘుడై |
| | ౨౩ | నాయులు | నాయకులు |
| ౭౩ | ౧౧ | క్షూర | క్షౌర |
| ” | ౨౨ | యంబుచు | యంబడు |

సమాప్తము.

## శైవ ప్రచారిణీ పక్ష పత్రిక

ఇది, ప్రతి పక్షమున ప్రకటింపఁ బడును. ఇందు విద్వాంసులచే వ్రాయఁబడు చరిత్రాంశములు- నీతి బోధకములగు కథలు- ఆరోగ్యదాయకములగు వైద్యవిధానములు- శాస్త్రచర్చలు- వ్యవసాయకతులు- స్వదేశ విదేశ వృత్తాంతములు- వేయేల! సర్వవిషయములు ప్రకటింపఁ బడును.

పక్షపత్రిక చందా సం॥ రు 2—0—0

గ్రంథమాల చందాదారులకు సం॥ రు 0—8—0

---

## శైవ ప్రచారిణీ గ్రంథమాల

ఇందు- అముద్రితములు- అనుపలబ్ధములు- ఆనర్ఘ గ్రంథములును నూరుపుటలకుఁ దక్కువగాని నాలుగు శైవగ్రంథరత్నములు మూఁడు మాసముల కొక్కటిచొప్పునఁ బ్రకటింపఁబడు చుండును-గ్రంథమాల చందాదారులకు నిందుఁ బ్రకటింపఁ బడిన గ్రంథములన్నియు సగము ధరకే పంపఁబడును.

గ్రంథమాల చందా సం॥ రు 4—0—0

పక్ష పత్రికతో సహా సం॥ రు 4—8—0

వలయువారు,

శైవప్రచారిణీ- వరంగల్,

అన్వేషింపవలెను.